సం॥ర చందా రు 1-0-0(పోస్టేజితో సహా) Reg. No. M. 3766

సంపుటము 32 సంచిక 10

# ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్య

# Andhra Rastra Prarambha Vidya

(విద్యావిషయిక మాసపత్రిక)

**జనవరి 1944**

సంపాదకులు:

శ్రీయుత మహావాది వేంకటరత్నముగారు, బి.ఏ.,



వ్యవస్థాపకులు:

శ్రీయుత ఈదర వెంకయ్యగారు,

ప్రొప్రయిటరు:

**రామా అండ్ కో.,**

హెడ్ఆఫీసు :— ఏలూరు,

బ్రాంచెస్:— గుంటూరు - రాజమండ్రి.

Printed by Mr Edara Venkaiah at his Pattabhirama Press, Ellore

# విషయసూచిక

ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్య

ANDHRA RASTRA PRARAMBHA VIDYA

విద్యావిషయిక మాసపత్రిక

సంపుటము 32 | ఏలూరు, 15 జనవరి | సంచిక 10



# నిత్యసంకీర్తనము

**వివరణము :**

మనమనసు మాటిమాటికి మనలను వీడి తన పూర్వవాసనలపైకి పోవుచుండును. అది యట్లుచేయుట భగవంతుని మఱచియే. కాని దానిని మనము మరల వెనుకకు త్రిప్పవలయును. మనము చిత్తమును పవిత్రమొనర్చుకొనుటను జీవితమును సామాన్యమొనర్చుకొనుట, నేర్చుకోవలయును. ఇట్లొనర్చిన ఆధ్యాత్మికజీవితము సర్వసామాన్యమైపోవును. అపుడు భగవంతుని స్మరింపక యుచ్ఛ్వాసమును బీల్చలేము. అపుడు మన యత్నము ఫలించును. శాంతిచేకూరును.

**సంకీర్తనము :**

1. హేపరమేశ్వరా! అశాశ్వతవస్తువులలో నీవే శాశ్వతుఁడవు.
2. నిత్యుఁడవగు నీయందే నా ధ్యానమంతయు నిలచునుగాక!
3. నీ స్మరణయే నా కధికమగునుగాక!
4. హే దయామయా! నీ నామస్మరణమే నా జీవనోపాధిగ నొనర్చుము. నిన్ను మఱచినదినము నాకు దుర్దినమగునుగాక!

—స్వామి రామతీర్థ.

# భగవన్నుతి

కల్లూరు అహోబలరావు

(వెనుకటి సంచిక తరువాయి)

సీ. శిలయందు వజ్రంబు మొలిపించి నీదివ్య । శక్తి స్వరూపంబు జాటినావు
నారికేళఫలంబు నందు నీరముఁబోసి । నీ రహస్యంబు వర్ణించినావు
ఫణిఫణాగ్రమునందు భవ్యమాణిక్యంబు । చిత్రించి నీగుట్టు జెప్పినావు
అండంబులోపల నడగించి పులుగు, నీ । దివ్య మహాత్మ్యంబు దెల్పినావు
గీ. చిత్రవర్ణంబు పూలకుఁజేర్చినావు । కూర్చినాఁడవు ప్రకృతికి గొప్పచెలువు
ప్రకృతిమధురస్వరంబులఁ బాడినావు ! భక్తమందార ! నీకిదే వందనంబు. ౮

సీ. నీలాంబరం బొండు నెత్తిపై సృజియించి । చుక్కలరాశితో సొబగుఁగూర్చి
సూర్యగోళ మొకండు సొంపుగా సృష్టించి । కిరణాలలో వేఁడిగీలు కొల్పి
చందమామను, ప్రేమ నందంబుగాఁ దిద్ది । చలువరాసులను, కొల్లలుగఁ జల్లి
మేఘమాలికలందు మెఱపుల మెఱపించి ! పిడుగుల నందులో వెలయఁజేసి
గీ. ప్రకృతి నీవిలాసము దిద్ది పరగినావు । మంచివాడని బిరుదు వహించినావు
మించునీగుట్టు నెవరు వర్ణించఁగలరు ! । భక్తమందార ! నీ కిదే వందనంబు !

సీ. అత్యద్భుతంబైన యంతరాళంబున । నఖిలాండకోట్ల నాడఁగఁజేసి
బంతులచందంబు వింతగా వానిని । నొకదానిచుట్టు మరొండు ద్రిప్పి
పవలు, రాతిరిఁజేసి వారంబు లొనగూర్చి । ఋతువత్సరముల సమ్మతినొనర్చి
ఎండవానల గురియించి శీతమొసంగి । పాడిపంటలనెల్లఁ బండఁజేసి
గీ. ప్రాణికోట్లను సతము గాపాడ నీవు । ఎన్నగారాని పాట్లు వహించినావు
నీరహస్యంబు నెవరు వర్ణించగలరు ! । భక్తమందార నీ కిదే వందనంబు. ౧౦

---

# వీధిబడి

వర్తమానయుగములోని ప్రాథమిక పాఠశాలను పూర్వకాలపువారు-అనఁగా ఎప్పటివారోకాదు మొన్న మొన్నటి వారు, కొంతవఱకు ఇప్పటివారుకూడ—వీధిబడిఅనేవారు. అయితే ఈపేరు ఎందుకు కలిగినది? ఇది యిప్పుడు మారి పోవుటకు కారణమేమి? అసలుదీని పూర్వ చరిత్ర యెట్టిది? కొంచెము విచారింతము.

పూర్వకాలములో— అనగా ఆంగ్ల పరిపాలనము మనదేశములో కుదురు కొనకముందు— మన విద్యావిధానమే వేఱుగానుండెడిది అందులోను దక్షిణ హిందూదేశమునందొక విలక్షణమైన పద్ధతిలోనుండెడిది ద్రవిడ సంప్రదాయము ననుసరించి ప్రాథమిక విద్యాబోధనమునకు ప్రత్యేక పాఠశాలలున్నట్లు తోపదు. ఇది

యిప్పటిమాటగాదు. చాల పురాతన కాలపుమాట. ఆకాలములో బాలురకు విద్యాభ్యాసము-అనగా అక్షరాభ్యాసము-ఆలయములో భగవత్సన్నిధానమున జరిగెడిది. ఆలయమన్నప్పుడు ద్రవిడ సంప్రదాయమునుబట్టి శివాలయమేయని రూఢమగుచున్నది. ఇందులకు ద్రావిడులు శివమతస్థులగుటయే ప్రబలకారణము. దీనినిబట్టి ఆకాలములో ప్రథమశిక్షకు ఆలయమేయనిమూలస్థానమనియు, ప్రత్యేకవిద్యాలయముండెడిది కాదనియు, తేలుచున్నది.

ఈ నిర్ణయమునకు ప్రబల తమ దృష్టాంత మింకొకటి కన్పడుచున్నది. బాలునకు తొలుదొల్త అక్షరాభ్యాసము చేయించునప్పుడు "ఓం నమశ్శివాయ, సిద్ధంనమః" అను పవిత్ర మంత్రాక్షరములను ఆ బాలునిచేత పలికించెడివారు. ఆమంత్రమును ఇసుకలోగాని, పలకలమీదగాని, దిద్దబెట్టెడివారు. ఈయాచారము—ఎన్నడో యేర్పడినది-ఇప్పటికిని నశించిపోలేదు. దొరతనమువారు దీనిని బంధింపకున్నను, అక్షరములను దిద్దబెట్ట రాదని శాసించినను, పల్లెటూరి పంతుళ్ళుగాని, పట్టణపు పంతుళ్ళుగాని, ఈయాచారమును చాలమటుకు అనులుపఱచుచునేయున్నారు. కాని దీని యర్థమును దెలిసికొని అనుసరించువారు చాల తక్కువమంది యుందురేమో? లేకున్న ఈపవిత్ర మంత్రాక్షరములు తారుమారగుటయు, అర్థహీనములగుటయు, సంభవింపనేరదు.

పూర్వులు అక్షరాభ్యాసకాలమున బాలునిచేత ఈ మంత్రమును పఠింపంచనేల? అనునది ప్రశ్న. సమాధానము—అక్షరాభ్యాసముజరుగుచున్నది దేవాలయములో. అందును శివాలయములో. బాలుడు భగవంతున కభిముఖుడై నిర్మలహృదయముతో తొలుదొల్త "ఓం" అను ప్రణవ మంత్రాక్షరము నుచ్చరించును. తరువాత చేతులు జోడించి "నమశ్శివాయ" (శివుని కొఱకు నమస్కారము) అని నమస్కరించును ఆతిరువాత "సిద్ధం నమః" (నమస్కారము సిద్ధించుగాక) అని పల్కును. చూడుడు! మన పూర్వులు అక్షరాభ్యాసమును ఎంతటి మహాత్కార్య మగా జేసినారో? ఇచ్చట శివశబ్దమును మూర్తిత్రయపరముగాగైకొనక "శివుడు సుఖమును గూర్చువాడు" అను నర్థమునంగైకొనుడు అనగా "ఏ దేవుడై తేప్రపంచమునకు సుఖమునుకలగించుచున్నాడో అట్టి దేవునకు నమస్కారము. నానమస్కారము సిద్ధించునుగాక!" అని బాలురు పరిశుద్ధ హృదయముతో ప్రార్థించు చున్నారు. తాను నేర్చు విద్య తన భవిష్యజ్జీవయాత్రా సుఖమున కాధారభూతమగునట్లు సమస్త సుఖప్రదుండైన భగవంతుడు (శంకరుడు సుఖమును గలిగించువాడు) తన నమస్కారమును స్వీకరించి తన్ననుగ్రహించుగాక యని బాలుని తాత్పర్యము. ఇంతటి యుక్తమార్థముతో విరాజిల్లు చున్నది యీ మంత్రరాజము. కాని నేడిది యర్థమెఱుంగని వారినోళ్ళంబడి "ఓనమః శివాయః సిధంనమః" అను నిస్సారంపు టక్కరములుగాను, ఇంకను కుదింపబడి "ఒనమాలు" అను లొల్లిపదముగాను, మారిపోయినది. మొత్తముమీాద దీనికిం గల బూర్వపు టౌన్నత్యముచచ్చిపోయినను ఆశయము మాత్రము జీవచ్ఛవము మాదిరి నిలిచియున్నది.

ఈ విధముగా బాలురకు అక్షరాభ్యాసము ప్రారంభమున్నత్పరిణమునో ప్రారంభమగుట క్రీస్తునకు కాలము నుండియు మనకు తెలియవచ్చుచున్నది కాబట్టి ప్రాథమిక విద్యాభ్యాసమునకు ఆ కాలములో దేవాలయములే ప్రధానస్థానములై యొప్పినవి. ఈయంశమును పాశ్చాత్య దేశచరిత్రలు గూడ రూఢి పఱచుచున్నవి. క్రీ. శ 15 లేక 16 శతాబ్దములవఱకు ప్రార్థనామందిరములే (Churches) విద్యకు నిలయములై యున్నట్లు పాశ్చాత్యదేశ చరిత్రములు చాటుచున్నవి. నాగరకత యొక్క చక్రపరిభ్రమణ సిద్ధాంతము ననుసరించి మనదేశపు టాచారమె అచ్చటను అనుసరింపబడెననుట నిర్వివాదాంశము.

ఇట్లు దేవాలయములో ప్రారంభింపబడిన ప్రాథమికశిక్ష మనదేశములో ఆర్యద్రావిడ సమ్మేళనము వఱకు అట్లే కొనసాగినది! కాని ఆర్యసంప్రదాయములు ప్రబలిన కొలంది, వర్ణవిభాగము ముదిరినకొద్ది, అస్పృశ్యతాపిశాచము ఆవహించిన కొలంది, దేవాలయపు ప్రాథమికవిద్యకుం బట్టుగొమ్మగా నిలువలేకపోయినది. అసలు ఆలయప్రాశస్త్యమే అడుగంటసాగినది. అస్పృశ్యత బలపడినప్పటినుండి, కడజాతి బాలురకు, నీచజాతుల బాలురకు ఆలయముయొక్క ఆవరణలోనికైన రానిచ్చుటకు సంఘము మొప్పుకొనలేదు. అంతేకాదు తక్కువజాతులవారికి చదువు చెప్పరాదని కూడ సంఘము శాసించినది. అంతటితో సమస్తజనులకుపయోగపడు దేవాలయము స్వార్థపరుల విత్తమగుటయు, విద్యాభ్యాసమునకు పెద్ద దెబ్బ తగులుటయు, సంభవించినది. అప్పుడు బుద్ధిమంతులగు పెద్దలును, సంఘశ్రేయోభిలాషులగు రాజులును విద్యాసమర్థులగల బోధకులును, కలిసి సమాలోచించిరి. ప్రాథమికవిద్య సర్వులకు లభించు విధానములను తర్కించినారు. ప్రత్యేకముగా నొకరియింటిలో ప్రాథమిక పాఠశాలను నెలకొల్పుదమన్న కడజాతివారు లోనికి వచ్చుటకు ఆ యింటివారు అంగీకరింపరు. ప్రత్యేకముగా ప్రతిజనపదమునందును ప్రాథమిక విద్యాలయమును నిర్మించుదమన్న ద్రవ్యము చాలదు. ఈ పరిస్థితులన్నియు తర్కించి యెట్లును మార్గము గానక అప్పటివారు నాల్గు బజారులు కలిసినచోట ఒక చౌకమును గడ్డికప్పుతో నిర్మించి అందు ప్రాథమిక పాఠశాలను నెలకొల్పుటకు స్థిరీకరించినారు. ఇట్టి చౌకముల కెవ్వరి యాధిపత్యమును లేదు. కడజాతి బాలురు వచ్చుటకును ఆటంకములేదు. వ్యక్తిగతముగా ఆటంకమున్నవారు అచ్చటికి తమ పిల్లలను పంపకుండెడివారు ఈ తీరున చివరకిది వీధిబడిగా మారిపోయినది. ఏనాడు మారినదో కచ్చితముగ చెప్పలేము, కాని నిన్నమొన్నటివఱకును ఇది వీధిబడిగానే నిలిచియున్నది.

వీధిబడిగా మారిన తరువాత ప్రాథమిక విద్య మొత్తముమీద మంచి యభివృద్ధిలోనికి రాగలిగినది గ్రామములోని అన్ని జాతులవారికి విద్య లభించు నవకాశమేర్పడినది. కాని అస్పృశ్యతాపిశాచము యొక్క ధూర్తపరిపాలనమునకు లోనైనవారు మాత్రము సమ్మెగట్టినట్లు తమ్ము పిల్లలను వీధిబడికి పంపుట మానినారు. అంతటితో నూరుకొనక తమ పలుకుబడిని వినియోగించి గ్రామములోని ధనవంతులను,

తదితరులకు, పురులు పెట్టి కానిబోధలుచేసి, తమవైపునకు లాగఁగలిగినారు. దీనితో గ్రామమున కక్షలేర్పడుటయు, ప్రత్యేక పాఠశాలలు నెలకొల్పబడుటయు, సిద్ధించినది. ఈపాఠశాలలు పెంపగుకొలంది వీధిబడులు — అనగా గ్రామ శృంగాటకమునందు నెలకొల్పఁబడినవి - క్రమక్రమముగా క్షీణింప సాగినవి కాని " వీధిబడి ' అను పేరు మాత్రము మాసిపోలేదు. ఈ ప్రత్యేక పాఠశాలలను గూడ వీధిబడి అనియే వ్యవహరించెడివారు. " కరణముగారి వీధిబడి - మునసబుగారి వీధిబడి - దేవాలయపు వీధిబడి "-ఈ తీరున గ్రామములోని ఆయా వీధులపేళ్ళనుబట్టి ఆయా పాఠశాలలు వీధిబడులుగా చెప్పబడేవి. ఇంతేకాని చౌకములకు మాత్రము చెందినవి కావు.

దేవాలయమునుండి ప్రాథమిక పాఠశాల వీధికెక్కి. అంటరానితనము ముదురుట వలన మఱల కక్షలతో గృహప్రవేశ మొనర్చినప్పటినుండి పెద్దమార్పుజరిగినది. అస్పృశ్యులకు చదువుకొను నవకాశమడుగంటినది. అభిమానులున్నను అధికారము కొఱవడినది. ఈ ప్రత్యేక పాఠశాలలకు అస్పృశ్యులను, కొన్నిచోట్ల నీచ జాతులవారిని, సుతరాము రానివ్వలేదు. ఇందువలన ప్రతిగ్రామములోను అస్పృశ్యులకు వారివారి గూడెములలో ప్రత్యేక పాఠశాలలు నెలకొల్పఁబడినవి. "మాలబడులు" అను పేరుతో అవికూడ క్రాలక్రమమున పెంపొందినవి. సర్వసమత్వముగల పెద్దలు, ధనవంతులు, మున్నగువారు వానిని అభిమానించి తగినట్లు ప్రోత్సహించిరి. ఎన్ని కక్షలేర్పడినను ప్రాథమిక విద్యాభివృద్ధి మాత్రము కుంటుపడక పోవుటేగాక విరివిగా పాఠశాలలు నెలకొల్పఁబడినవి. ఆనాడు ప్రతి వీధికి ఒక పాఠశాల ఉన్నదనియే చెప్పవచ్చును. ఇదియును నామమాత్రముగాదు. ప్రతి వీధివారును, తమ పాఠశాలయే అన్నివిధముల మిన్నగానుండవలెనని పోటీలతో కృషి చేసిరి. అందువలన ఆనాటి ప్రాథమిక విద్యాబోధనము గట్టి పునాదులమీద జరిగినదని చెప్పక తప్పదు. కాబట్టియే ఆ కాలపు ప్రథమరీ పరీక్ష ప్యాసయినవారు ఈకాలపు స్కూలుఫైనల్ విద్యార్థి కంటెను గట్టివాడని చెప్పఁగలుగుచున్నాము.

ఆకాలపు విద్యాస్వరూపము, బోధనా విధానము, గురువులపటిమ, శిష్యుల వినయ విధేయతలు, తల్లిదండ్రుల సహకారము, గ్రామస్థుల విద్యాభిలాష మున్నగునవి ఇప్పటివలెగాక ఒక విశిష్ట సంప్రదాయము ననుసరించినవి. ఆనాడు విద్యార్థికి అక్షరాభ్యాసము జరిగించుటయన్న ఒక పెద్ద పండుగ. తల్లిదండ్రులకు మితిమీరిన సంతోషము. కొత్త దుస్తులు తొడిగి చక్కగా అలంకరించి బాలుని మేళతాళములతో ఊరేగించి పాఠశాలకు తీసుకవచ్చెడివారు. ముందు సరస్వతీపూజ— తరువాత గురుపూజ. గురువునకు చందనాదులు పూసి క్రొత్తబట్టలు గట్టపెట్టెడివారు. ఉన్నవారు భూరిదక్షిణలిచ్చెడివారు. ఇవి ముగిసినతరువాత అనాదిసిద్ధమైన "ఓం నమశ్శివాయ" అను ప్రణవమంత్రాక్షరములను నోట బలికించి అంతరార్థము గ్రహింపఁబడకున్నను— ఆచారప్రకారము ఆమంత్రాక్షరములను

దిద్దఁబెట్టెడివారు. ఆనాడు బంధుమిత్రాదు లందు—పురోహితునకు స్వయంపాక దానము- గురుకుటుంబమునకు భోజన సామగ్రి- పిల్లలకు పప్పుబెల్లాలు- పెద్దలకు చందనతాంబూలాలు- కోలాహలముగా పంచిపెట్టెడివారు. గ్రామస్థుల ముఖము లందు ఆనాడొక నూతనోత్సాహము తాండవించెడిది. బిడ్డలున్నవారు ఇట్టి యదృష్టసమయమున కువ్విళులూరుచుండ బిడ్డలు లేనివారు నిరాశాపూరిత నయనము లతో కన్నీటి గుటకలు మ్రింగెడివారు.

అక్షరములన్నియువచ్చి, గుణితము పూర్తియైన తరువాత బాలునకు పుస్తకము పట్టించుట మఱొకపండుగ. ఆనాడుగురువు గారికి మఱలకానుకలు చిన్న చిన్న శతకములుచెప్పి, వాచకధోరణి చక్కగా కలిగించి, బాలునకు పెద్ద పుస్తకము పట్టించుట మఱొకపండుగ ఆనాడు గురువు నకు తిరిగి కట్నములు - కానుకలు. పెద్ద పుస్తకము పట్టించుట యన్న బాలునకు భాషాజ్ఞానము చక్కగానేర్పడిన దన్న మాట. చదువను, వ్రాయను, బాలుఁడు తీ ర్ణుడయ్యెనన్నమాట. ఇట్టి యుత్తీర్ణతకలు గుట తోడనే, బాలునకు భారతభాగవ తాదులు, అమరము, ఆంధ్రనామ సంగ్ర హము, మనుచరిత్ర, మున్నగు గ్రంథ ములు చెప్పబడును. ఈచదువుఅంతయు సాధారణముగా అయిదాఱు సంవత్సరము లలో పూర్తియగును. ఈ లో ప ల బాలునకు తల్లిదండ్రుల యిష్టప్రకారము వారివారి వృత్తుల ననుసరించి వలసిన లెక్కలు, భూమికొలతలు, మున్నగునవి యన్నియు బోధింపబడును. ఇంతటితో బాలునకు ప్రాథమికశిక్ష పూర్తియగును.

ఆనాటిగురువులింతస్వల్పకాలములోనే ఇంతటి గట్టి విద్యబోధింపఁగలిగినారన్న నాటి పరిస్థితులే వేఱు. నాటివిద్యాస్వరూ పమే వేఱు. గురువునకానాడున్న సౌకర్య ములునేడు లేవు. అప్పటి గురువునకు కూడుగుడ్డలకు కొఱత లేదు. నెలకురెండు సార్లు ఆట్లవిడుపుగింజలు. గింజలు నూర్చు నప్పుడు పెట్టుబడులు-దసరాపండుగకు కాను కలు-ఒక్కొక్కవిద్యాఘట్టమునకు పంచల చాపులు-ప్రతిపండుగకు స్వయంపాకదాన ములు-శుభకార్యములందు సత్కారములు ఇన్నివిధముల గ్రామస్థులు గురువును ఆద రించి పోషించెడివారు. అతడు వేఱొక వృత్తికి జొచ్చునవసరమువేదు గనుక ఎల్ల ప్పుడు పాఠశాలయందేనిమగ్నుడైయుండెడి వాఁడు. త్వరలో బాలుని ఉత్తీర్ణుని జేసిన పక్షమున బంగారపు మురుగులు మొద లగు బహుమతులుగూడ లభించెడివి గనుక అతడు విద్యాబోధనయందు మిక్కిలి శ్రద్ధ గైకొనెడివాడు. ఇందుకుతోడు పల్లెజనుల యభిరుచులనుబట్టి విద్యబోధించుట గనుక నాటిగురువు తల్లిదండ్రుల యాదరాభిమాన ములను చూరగొనఁగలిగినాఁడు. నిన్న మొన్నటివఱకు ఈవిధముగనే పల్లెకూట ములందు ప్రాథమికవిద్య బోధింపఁబడినది. వీధిబడులు నేటికంటె ఆనాడు ప్రాథమిక శిక్షకు గట్టికృషి చేసినవని చెప్పవచ్చును.

ఇంతటితో "వీధిబడి" వృత్తాంతము ముగియుచున్నది. ఇక "నేటిప్రాథమిక పాఠశాల ప్రాథమికవిద్యాభి వృద్ధి కెంతవఱకు తోడ్పడుచున్నది?" అను విషయమును గుఱించి రాఁబోవు సంచికలో చదువుదురుగాక!

* * * —సంపాదకుఁడు.

# ఖండములు - వానిపేళ్ళు

రచయిత : నేమాని కుటుంబశర్మ

పూర్వకాలమున ఖండములకున్న సంస్కృత నామములే ప్రస్తుతము వాడుకలో నున్న హూణనామములుగా మార్పుచెందినట్లు తోచుచున్నది. అదెట్లన .

1. ఏషియా:— నరపతులు, గజపతులు, అశ్వపతులు, అనుమూడు తరగతులన రేశ్వరులుకలరు. వారిలో చంద్రవంశజులును, దేవమీఢుని సంతతివారలును నైన "అశ్వ" యనుజాతివారలు కలియుగ ప్రారంభమున "పంచనదీదేశము నందుగల సింధునదియొక్క రెండుతీరములను, నాక్రమించి తమ భుజబలముచే గొప్పభూభాగమును జయించి, ఆభాగమునకు "అశ్వ" ఖండమని నామమంచిరి. తరువాత నది "అసియా" "ఆసియా" "ఏషియా అనుశబ్దములుగా మారినది.

2. అమెరికా:— "అమరిక" యను సంస్కృతపదమునకు నివాసమున కనుకూలము, అంద మని యర్థముకలదు. మంచినీటికాకరంబులగు తటాకంబులు, నెడతెగని ప్రవాహముకలిగి మండువేసవియందైనను నెండిపోవనట్టి నదులు, అనేక రకములగు ఫలవృక్షములచేనొప్పి, పంటలకాలవాలమై యుండియుంటచే మిగుల వాసయోగ్యముగాను, చూపునకు సుందరముగాను, గనుపట్టుటంబట్టి ఆఖండమున కాపేరు కలిగినది. అదియే "అమెరికా" యనుపదము గారానురాను మార్పుచెందినది. ఆఖండము దక్షిణోత్తరదిశలకు వ్యాపించియుండుటచే దక్షిణోత్తర "అమెరికా" లని పిలువబడుచుండెను.

3. ఆఫ్రికా:—అసలు సంస్కృతశబ్దము "అః + పరి + అఖ" కలసి అఫర్యాఖ" యనునది "ఆఫ్రికా" యనుహూణ శబ్దముగా మారెను. అః = సూర్యరథాశ్వము" అఖ (ఖా) శప్ - అ - అఖగతౌ - అఙ్గతే = నడచుచున్న పరి = మార్గము కలది అనగా సూర్యునిరథ మేమార్గము గుండ వెడలునో దానికి భూమధ్య రేఖయనిపేరు. ఆమార్గము కలదిగాన ఆఖండమునకు ఆఫ్రికాయనిపేరు కలిగెను.

4 యూరప్ (ఐరోపా):— అసలు "సురూప" యనునదియే "యురూప" గా మారెను. సంస్కృతమున "సు" అంత అర్థసంజ్ఞకలదో ఆంగ్లమున "యు" అనగా అంతయర్థముకలదు. కాన "సురూప" యనునదియేముందు "యురూప" క్రిందమారి పిదప "యూరప్, ఐరోపా "ఖండమని పిలువబడుచుండెను. ఆఖండము చాలభాగము మంచుప్రదేశమగుటచే మిగుల తెల్లగా గనపట్టును. వర్ణములయందు ధవళవర్ణము మిగులయందమై మనసునకానంద మొదవును. ఆకారణమున మనవారలు దానికి "సురూప" ఖండమని నామమొసగిరి. దానికే "శ్వేతదీపమని" కూడ నామము కలదు.

5. ఆస్ట్రేలియా:—"అస్త్ర + ఆలి + అయః" అను మూడుపదములు కలసి "అస్త్రాలెయః" అనునదియే "ఆస్ట్రేలియ" గ మారెను. అదియే రానురాను ఆస్ట్రేలియా యైనది. "అయః (ధా) యనగా-అనగ గతౌ" లేక "గతాగతౌ"—వెడలి వచ్చేటటువంటి అస్త్రః-బాణముయొక్క, ఆలి-సమూహము కలవారచట నుండుటచే నాఖండమునకు "అస్త్రాలెయః" యను నామమువచ్చెను. ఆస్ట్రేలియాఖండవాసులవద్ద "బూమెరాంగు" లను నాయుధములు గలవు. వారు శత్రువులపై ఆ బాణమును ప్రయోగించినచో అది శత్రువును సంహరించి తిరిగి ప్రయోగించిన వానివద్దకుపోవును. అట్టి ప్రజలు ఆ ఖండమున నుండుటచే దానికి "ఆస్ట్రేలియా" అను పేరు కలిగెను.

6. ఓషేనియా:—(పసిఫిక్) శాంతమహాసముద్రమునఁ గల కొన్నికొన్ని దీవులనుకలిపి, వానికి "ఓషేనియా" యని నామమిడిరి. సముద్రమున కుండబడిన నామములలో నొకటియైన "ఉదధి" యను శబ్దభవమే "ఓషన్" అను ఆంగ్లశబ్దమైనది. అట్టి "ఓషన్" యందుగల ద్వీపసమూహమగుటచే వానికి "ఓషేనియా" యను నొక్క పేరు కలిగినది.

షరా :—సప్తద్వీపముల నామము లాయా ఖండములకు వచ్చుటకుఁగల కారణము రాబోవు సంచికలో ప్రకటింపఁబడును.

---

# సంక్రాంతి

బాలకవి అన్నాప్రగడ వీరరాఘవయ్య

సీ. చలిగాలి వాడికత్తుల నూరి తెగగొట్టి పదను గోల్పడిన పవ్వళ్ళతోడ
తెలివెన్నెలలనిగ్గు లలరు దళ త్తళక వర్షించు నిహారవారితోడ
జగదేకమోహన సౌందర్య సంపూర్ణ లీలతో రంగవల్లికలతోడ
పసిడి లేమెఱుంగులు 'భాసిలి' విరియఁగాఁ బూఁచిన క్రొంబంతిపూలతోడ
తే. గీ గృహాగృహమ్మునసంతృప్తి గీలుకొలిపి । ముదముగూర్చెడు ధాన్యసంపదలతోడ
అమృతనిష్యంద మధురసౌఖ్యములతోడ । కదలి యేతెంచె మకరసంక్రాంతి లక్ష్మి.
చ. చలికి వెడంద జంకకయె స్నానమొనర్చి ముఖంబునందుఁ గ్రొం
దెలుపుఁ గలట్టినామములఁ దీరిచి నాభలఁ జుట్టబెట్టి యా
దల నొకదామపాత్రమును దాల్చి రమాధవుఁ బాడికొంచుఁ బెం
దలకడ భక్తిమీఱు హరిదాసుఁడు వచ్చెను వీధిలోనికిన్.
సీ. అల్లుఁ డేసమయాన నరుదెంచునోయని యింటికి వెల్ల వేయించె నత్త
మఱది వచ్చుటతోనే వరుసల నాడెద ననుచు సిద్ధముగ నుండినది వదిన
బావపజ్జను జేరి పరిహాస మాడంగ మురిసెను లోలోన ముద్దుబాల
జామాతకోసమై సరిగంచుధోవతు ల్గొనఁగ బజారుకు జనియె మామ

తే. గీ. భర్తరాక పూరాననే పాలఁజూచి । సిగ్గుచేఁ దల్లిచాటునఁ జేరె ముగ్ధ
ఇంతలోన జామాత దా నేగుదెంచి । యందఱకు సంతసముఁ గూర్చె నతులితముగ.
సీ. భోగిపండుగఁ జేయ బొమ్మలు లేవని జనయిత్రి మ్రోల నేడ్చినది బిడ్డ
పేరంటమున చంద్రహారంబు లేదని తనకుఁదానే గొణుగికొనియె కన్నె
నన్నాయి మామూలుచాలమి మర్యాదమిగిలి మాటాడెను మేళగాఁడు
కోడిపందెములోన నోడిపోవుటచేత ఓమిలి దుప్పటి గప్పుకొనియె కాఁపు
తే. గీ. తర్పణమునకు దక్షిణ తగ్గెనంచు । రట్టుతో రచ్చ కెక్కెను బ్రాహ్మణుండు
సుఖములందున కష్టాల జూపు మకర । సంక్రమణలక్ష్మి ! నీకు సుస్వాగతంబు.

---

# తప్పెవరిది?

ప్రాథమికవిద్యయందు ప్రజల బాధ్యతను గుర్తింపజేయు చిన్ననాటిక :

జి. కె. చౌదరి

(గతసంచిక తరువాయి)

రెండోరంగము

అమర్నాడు మధ్యాహ్నము 3 గంటల వేళ; మునసబుగారి ఇల్లు. పంచపాళీలో అరుగుమీద తివాసీపై మునసబుగారు, కరణం రంగయ్యగారు, కూర్చున్నారు. మునసబు నరసయ్యగారు ఏమిటో చెపుతూవుంటే కరణంగారు వాలుబల్ల ముందుకు లాగుకొని వ్రాస్తున్నారు. రమణారావు, సంజీవరావు, వెంకటసుబ్బయ్య ప్రవేశిస్తారు. మునసబుగారు కళ్లజోడు నుదుటిమీదికినెట్టి తలపూర్తిగా పైకెత్తి చూచి—ప్రక్కనవున్న బల్లమీద కూర్చోమన్నట్టుగా సంజ్ఞచేసి—

నరసయ్య:-ఎప్పుడు వచ్చారు సంజీవం?

సం:-మొన్న ఉదయం పది గంటల బండికి.

న:-రమణా, నువ్వు ఒకబళ్లోనేనా?

సం:-అవును.

న:-ఏక్లాసు

సం:-సెకండియర్.

న:-మనఊరు మొత్తము మీద జాగ్రత్తగా చదువుతున్నది, బుద్ధిమంతులనిపించుకొంటున్నదికూడ, మీరిద్దరే. ఆపేరుమాత్రం చెడగొట్టుకోకండి.

(వెంకటసుబ్బయ్యనుచూచి) వెంకటసుబ్బయ్యా! మూలచేను కట్టివేశారా? ఇట్లావచ్చావేం?

వెం.సు,-ప్రైవేటుమేష్టర్ని తీసుకవస్తానన్నారు. ఎప్పుడు వస్తారు?

న:-అవుటపల్లిలో ఒకాయన వున్నాడట. కబురు చెయ్యాడమో, వెళ్లిమాట్లాడిరావడమో, చెయ్యాలి.

వెం.సు;-ఇరవైరోజుల క్రితమే అన్నారుగా ఇట్లని-

న:-అవును. అన్నాను. తీరుబడి ఎక్కడ

చచ్చింది. ఎక్కడ లేకపోతే అక్కడేపాడు. నాలుగురోజులనాడు వాయిదాకు వెళ్లి వుదయాన్నే వచ్చాను. ఊళ్లో లేకపోతే వ్యవసాయము పాడు. వాయిదాలకు వెళ్ళక పోతే వ్యవహారాలుపాడు. ఏంచెయ్యను?

రమణః- ప్రైవేటుమేష్టరు ఎవరికండి ?

నః- మాఅబ్బాయిలకే.

రంగయ్య(కరణం):- ప్రయివేటుమేష్టరు సంగతి నీకెందుకు సుబ్బయ్యా!

వెం.సుః- మారంగారావును కూడ ప్రయివేటుబడిలో వెయ్యాలని వుందండి.

రమణః- మీఅబ్బాయిలు ఎన్నోక్లాసు.

నః- ఎన్నో ఎక్కడిది ? పెద్దవాడు నాలుగ్గోక్లాసు. రెండోవాడు రెండోక్లాసు.

సంజీః- ఈవూళ్ళో బడివుంది కదండి. ప్రయివేటు మేష్టరు ఎందుకు ?

నః- నేతిబీరకాయలో నెయ్యి వున్నట్లు గానే ఈవూరుబళ్లో విద్యాభివృద్ధి వుంది.

రః- విద్యాభివృద్ధి కలుగక పోవడానికి కారణం ?

నః- తరచు మేష్టర్ల ట్రాన్సుఫర్లు ఎవడికి వాడే వెళ్ళిపోవడానికి ప్రయత్నము చేస్తూ పాఠశాల విషయములో నిర్లక్ష్యం గ్రామస్థులలో ఏమీ శ్రద్ధ లేకపోవడము- ఇన్ని కారణములవల్ల బళ్లో చదువు అంత అంతంతమాత్రంగా వుంది.

సంః- మీరు ప్రత్యేకముగా పంతుల్ని తీసుకవస్తే బోర్డుస్కూల్లో విద్యాభివృద్ధి అయ్యే సూచన లేమైనా వున్నాయా ?

నః- స్కూలు స్కూలే, మావాడిని కాస్త శ్రద్ధ తీసుకోకపోతే పైకివచ్చేటట్టు కనపడటంలేదు.

రః- గ్రామస్థులందరికీసంబంధించినఅన్ని వ్యవహారాలలోను పురోగామిగా వుండి సరిదిద్దుతున్న మీరు విద్యావిషయంకగా మాత్రము మీఅబ్బాయిల శ్రద్ధతోనే సరి పెట్టుకుంటే గ్రామస్థులందరిగతీ ఏమికాను?

నః- ఈవిషయంలో అందర్నీ గూర్చి నేనేమి శ్రద్ధ చెయ్యను ? కాస్త శ్రద్ధ వున్న వాళ్లు, శక్తి వున్నవాళ్లు, వాళ్ల నీలు వాళ్లు చూచుకుంటారు, బోర్డుస్కూల్లో మాత్రము అక్షరపుముక్క రాదు.

సంః- శ్రద్ధవుండి, శక్తివుండి అన్నారు. శ్రద్ధ వుండి శక్తిలేని వాళ్ళస్థితి ?

వెం.సుః- యథాప్రకారసిద్ధిరస్తే-

రః- బోర్డుస్కూలు మేష్టర్లు అందుకు గాను ప్రత్యేకముగా ఏర్పాటు గావింప బడ్డారుకదా ? వాళ్ళచేత క్రమంగా పని చేయించుకోవాలి గాని శక్తి వున్న మన మంతా ప్రయివేటు పాఠశాలలు పెడితే శక్తిలేని అశేషజనముయొక్క అజాగతీ వుండకపోవడమే కాకుండా, ఈబడి కాస్త తీసివేస్తారు. అప్పుడు ?

నః- ఐతే ఏంచెయ్యమంటారు ?

రః- ప్రత్యేక పాఠశాలలు పెట్ట డబ్బు ఖర్చుపెట్టు నవసరము లేకుండానే బిడ్డలకు విద్య అబ్బే అవకాశ మున్నప్పుడు దాన్ని విడిచిపెట్టకూడదు.

నః- సరే, ఉన్న అవకాశాల్ని పూర్తిగా వినియోగించుకోవాలి అంటున్నారు. వప్పు కుంటాను. మరి అక్కడ అక్షరపుముక్క రావడంలేదు. అదెట్లా ?

సంః- అక్షరపుముక్క ఎందుకురాదు. పూర్తిగా వస్తుంది. ఉపాధ్యాయుల్ని ఉపారు చేస్తు మనము కాస్త శ్రద్ధ తీసుకుంటే తప్పకుండా వస్తుంది. ప్రయివేటుస్కూల్లో వచ్చే చదువు బోర్డుస్కూల్లో ఎందుకు రాదు? రానిది ఎక్కడా రాదు.

న:-నెలకొకడు, రెండు నెల్లకొకడు చొప్పున వచ్చి పొయ్యే ప్రతిపంతుల్ని గూర్చి శ్రద్ధ తీసుకోవడము పది పనుల మీద తిరిగే నాకు ఎంతవరకు సాధ్యము ?

ర:-పదింట పదకొండోది మీపనులు ఏమీ చెడగొట్టుకోకుండానే పాఠశాల సమస్య పూర్తిచెయ్యవచ్చు.

న:-పైవాళ్లుచేసే ట్రాన్సుఫర్లనుగూర్చి మనమేమి శ్రద్ధచేస్తాము?

సం:-మీరు శ్రద్ధచేస్తే ట్రాన్సుఫర్లు ఆగుతాయి. మీరుఇనస్పెక్టింగు ఆఫీసర్లను అడిగితే కాస్త జాగ్రత్త అయిన టీచర్లను కూడ వేస్తారు. ఉపాధ్యాయులవల్ల గ్రామస్థులకు ఒక అవసరమువున్నదని గమనించి వాళ్లకు చేయదగు స్వల్పపు సాయము చేస్తూవుంటే జన్మస్థానమునుకూడ మరిచి వుంటారు. వాళ్లూ యావచ్ఛక్తినీ విని యోగించి పనిచేస్తారు 'మనపిల్లలకు తప్పకుండా చదువు వస్తుంది.

న:-దమ్మిడీ ఖర్చవకుండా చదువువచ్చే అవకాశాలు వున్నప్పుడు ఖర్చుపెట్టడం మ్మా కేమన్నా డబ్బుచేదా? ఇప్పుడేమి చెయ్యాలి ?

సం:—ఇప్పుడు ఈ పాఠశాలలోవున్న ఉపాధ్యాయులలో సమర్థులైనవాళ్లనువుంచి తక్కినవాళ్ల స్థానంలోకూడ తగుసమర్థుల్ని వేసేటట్టుచూడాలి.

న:-మేము కోరినంత మాత్రాన వేస్తారా?

సం:-వేసితీరుతారు. మీరు అడిగేది మీ ఒక తరఫునకాదు - గ్రామస్థులందరి తరఫునాను - ఐనప్పుడు ఎందుకు వెయ్యరు?

ర:-ప్రజాభిప్రాయానికి వ్యతిరేకముగా ప్రవర్తించడము ఎప్పుడూ అసాధ్యమే షాళ్లుమాత్రము ఎందుకు ఏర్పడ్డారు? ఆశాఖాభివృద్ధికి వలసినసాయము చెయ్యడానికి కాదూ?

న:-సరే ఒకటి-తరువాత ?

సం:-గ్రామస్థులందరి తరఫున పాఠశాలకు సంబంధించిన, ఉపాధ్యాయులకు సంబంధించిన, బాగోగులను పరిశీలించడానికి ఒక పంచాయితీ సంఘమువుండాలి.

న:-ఉండి ?

సం:-గ్రామము తరఫున విద్యార్థులతరఫున-తల్లిదండ్రులతరఫున- ఉపాధ్యాయుల తరఫునకూడ, లోటుపాట్లు చెప్పడానికి-అభివృద్ధి మార్గము అన్వేషించడానికిగాను ఈసంఘము చీటికి మాటికి.తలకొకపెద్దగా వెళ్లి ఉపాధ్యాయులను అదమాయింపబోయే సామాన్యులకు వీలులేదు. ఏకాస్త విషయము అయినా, ఈపంచాయితీద్వారా ఐతేనే పరస్పరము గౌరవార్హము, అభివృద్ధిదాయకమూను.

న:-ఏమండీ! కరణంగారూ! ఇప్పుడు మనవాళ్లు చెప్పినదానిమీద మీ అభిప్రాయమేమిటి ?

రం:-నాకు పూర్తిగానచ్చింది వాళ్లు చెప్పిన ప్రకారముచేస్తే మన పాఠశాల చాలా ఉన్నతస్థితికి రావడమే కాకుండా తక్కంగల పాఠశాలలకు ఆదర్శంగాకూడ వుంటుందని నమ్మకము.

న.-ఏంరా, సుబ్బయ్యా! నీవుద్దేశ్యమేమిటి ?

వెం:-ప్రత్యేకము నావుద్దేశ్యమేమిటి ? ఏవిధమ్ముగానైనా సరే పిల్లలకు అక్షరమ్ముక్కవచ్చే మార్గము చూడండి.

న:-మీరు పిల్లలే అయినా ఈ విషయంలో గమనించదగ్గ సలహాలుచెప్పారు.

ఆ ప్రకారము చెయ్యడానికి ఏమీ ఆక్షేపణ లేదు. రేపు నేను ఊళ్లోవుండను. కనుక రాత్రికే మిగిలిన వాళ్లనుకూడ ఆలోచించి ఈవిషయమై ఏర్పాటులు చేద్దాము ఏమండీ, కరణంగారూ ?

రం:-ఇతర గ్రామపెద్దల్నికూడ సంప్రదించండి.

న:-అట్లానే చౌదరయ్య బాబు ఊళ్లో వున్నాడా, సుబ్బయ్యా ?

వెం:-నిన్న ఉన్నాడు. తెల్లవారి కనబడ లేదు మరి.

న:-రాత్రికి మీరు ముగ్గురు కూడ బ్రాడాయి దగ్గరకు రండి. కరణంగారు వస్తారు. ఇతర పెద్దలకు కబుర్లుచేసి పిలిపిస్తాను అందర్నీ సంప్రదించే ఈవిషయం నిర్ణయించుదాము

సం:-రమణ-అట్లానే వస్తాములెండి-వెళ్లివస్తామండి.

వెం. సు:-వస్తానండి.

న:-మంచిదినాయనా !

(సంజీవరావు, రమణరావు, వెంకట సుబ్బయ్య, నిష్క్రమింతురు.)

---

# ఆసియాఖండము—ముఖ్యవిషయములు

వేదుల నరసింహము, బూర్జ

(గతసంచిక తరువాయి)

చైనా సామ్రాజ్యములో చేరిన దేశములు:—

1. చైనాదేశము, 2. మంగోలియా, 3 మంచూరియా, 4. టిబెట్టు, 5. సికియాంగు.

జపానువారికి గల ఆపద - దానిని తొలగించుకొనుట:—

జపానుదీవులందు తరచు భూకంపములు సంభవించును. అందువలన పట్టణములు ధ్వంసముచేయబడును. ఈ భయమువలన ఈ దేశీయులు తమయిండ్లను వెదురుతోను, కాగితముతోను కట్టుకొందురు.

స్టెప్పీలు:—

ఆసియాఖండములో సైబీరియా మైదానములో సరుగుడు అరణ్యములకు దక్షిణమునగల గడ్డి మైదానములకు స్టెప్పీలు అని పేరు. ఇచ్చట పశుపాలనము ముఖ్యవృత్తి. ఇచ్చటనుండి వెన్న, జున్ను, మాంసము, చర్మములు ఎగుమతి యగును.

ట్రాన్సుసైబీరియా రైలుమార్గము:—

ఇది యూరపుఖండమందలి, లెనిన్‌గ్రాడ్ నుండి పసిఫిక్ మహాసముద్రతీరమున గల వ్లాడివాస్టక్ వరకు పోవును. దీనిమీదుగ ఉన్ని మాంసము, తోళ్లు, బంగారము, నేలబొగ్గు, ఎగుమతియగును

ఆసియాఖండమునందు విపరీత శీతోష్ణస్థితులుండుట కు కారణములు:—

1. ఈ ఖండము ఉత్తరధ్రువ సమీపమునుండి భూమధ్యరేఖవరకు వ్యాపించి

యున్నది. (2) పడమటిదిశను ఈ ఖండము భూభాగముతో కలిసియున్నది. (3) తూర్పు దక్షిణదిశలయందు మహాసముద్రము లావరించియున్నవి. (4) మధ్యభాగము మిట్ట ప్రదేశము (5) నైరృతిభాగము నీరభూమి, 6. ఉత్తరధ్రువ సామీప్యమున శీతలవాయువులు వీచును.

తూర్పు ఇండియాదీవులలో సంవత్సరము పొడవుననూ వర్షము, ఎందుచేత ?

తూర్పు ఇండియాదీవులందు వేసవికాలమందు జూన్ నెల మొదలు సెప్టెంబరు వరకు నైరృతిపవనముల వలన వర్షము కురియును. శీతకాలములో నీటి యావిరితో కూడిన గాడ్పులు ఈశాన్యమూలగ వీచును. వీటివలన ఈ దీవులలో సంవత్సరము పొడవుననూ వర్షము కురియును.

నైఋతి ఆసియాయందు వర్షము తక్కువ ఎందుచేత?:—

వేసవియందు దక్షిణభాగమునుండి చెమ్మగాలులు భూమిమీదకు వీచును. ఇవి భూభ్రమణమువలన నైఋతిమూలనుండి వీచును. ఈ గాడ్పులు చైనా, జపాను దేశములకు ఆగ్నేయమూలనుండి వీచి అధికవర్షము నిచ్చును. లోభూములకు పోయిన కొలది వర్షము తక్కువ. అందుచేత నైరృతి ఆసియాయందు వర్షము తక్కువ.

వ్యాపారమార్గములు :—

1. హిందూదేశమునుండి అరేబియా సముద్రపు టుత్తరతీరము ననుసరించి పరిష్యాసింధుశాఖవరకుపోయి అచ్చటనుండి బాగ్దాద్ మీదుగ సిరియాలోని అలెప్పో వరకు పోవుచున్నది.

2. ఇండియానుండి కైబరుకనుమ్మమీదుగ ఆఫ్గనిస్థానము, టర్కీవరకు పోవుచున్నది.

3. మధ్య ఆసియాకును మనదేశమునకును, కాశ్మీరము ద్వారా వ్యాపారము జరుగుచున్నది.

4. హిమాలయ పర్వతములందలి కనుమలద్వారా నేపాలు, టిబెట్టు, బర్మా, చైనాదేశములతో వర్తకము జరుగుచున్నది.

ఐరోపా - రాజకీయభాగములు.

(1) అట్లాంటిక్ సముద్రతీరప్రాంతపు దేశములు :—

1 నార్వే 2 డెన్మార్కు 3. జర్మనీ 4. హాలెండు 5. బెల్జియమ్ 6. పోర్చుగల్ 7 ప్రాన్సు 8. బ్రిటిష్‌దీవులు.

(2) మధ్యధరాసముద్రతీరపు భూములు :—

9. స్పెయిన్ 10. ఇటలీ 11. గ్రీసు 12. యుగోస్లోవియా 13. టర్కీ 14. ఆల్బేనియా 15. బల్గేరియా.

(3) బాల్టిక్ సముద్రప్రదేశములు :—

16. స్వీడను 17. ఫిన్‌లాండు 18. ఎస్టోనియా 19. లాట్వియా 20 లిథూవేనియా.

(4) మధ్యదేశములు :—

21. స్విట్జర్లాండు 22. ఆస్ట్రియా 23. హంగేరీ 24. జెకోస్లావేకియా. 25 పోలెండు 26. రుమేనియా.

(5) తూర్పు ఐరోపా :—

27. రష్యా,

## ఐరోపా—ముఖ్యపట్టణములు

1. సెవీల్:—ఇది దక్షిణ స్పెయిన్ లోగల పట్టణము. ఇది సారాయి కాచుటకును, నారింజఫలములకును చాల ప్రసిద్ధి.

2. మిలాన్:—లంబార్డీ మైదానమందు మల్బరీ తోటలు విస్తారము. పట్టు పరిశ్రమకు ఇటలీ దేశములోని మిలాన్ పట్టణము కేంద్రస్థానము.

3. బర్గెన్
4. స్టావంగర్
5 ట్రాడ్ జమ్
} ఇవి నార్వేతీరమందున్నవి. చేపలవేటకు ప్రసిద్ధి.

6. గ్రిమ్సుబీ
7. యార్ మత్
} ఇవి ఇంగ్లాండులోనున్నవి. చేపలవేటకు ప్రసిద్ధి.

8. మిడిల్సుబరో:—ఇది డర్ హాం, యార్కుషైరు. బొగ్గుగనులకు మధ్యనున్నది. ఇది రేవుపట్టణము. స్వీడన్ దేశమునుండి ఇచ్చటికి ఇనుము దిగుమతియగుచున్నది. ఇనుపపరిశ్రమకు ప్రసిద్ధి.

9. బర్మింగ్ హామ్:—దక్షిణస్ట్రాఫర్డ్ షైర్, వారిక్ షైర్, బొగ్గుగనుల సమీపమున ఈపట్టణము గలదు. ఇది ఇనుపపరిశ్రమకు ప్రపంచములో ప్రసిద్ధి పొందినది.

10. షెఫీల్డు:—ఇది యార్కుషైర్, బొగ్గుగనుల సమీపమునున్న గొప్ప పారిశ్రామిక పట్టణము. ఉక్కుపరిశ్రమకు ప్రపంచములో ప్రసిద్ధిపొందినది. కత్తులు, బాకులు, శస్త్రసామానులు తయారుచేయుదురు.

11. ఎస్సెన్
12. డ్యూసెల్ డార్ఫ
} ఇవి రూరులోయందు (జర్మనీలో) అణగియున్నవి. ఇవి ఇనుము, ఉక్కు సామానులకు ప్రసిద్ధి.

13. మాన్ ఛెస్టరు:—ఇది ప్రపంచములో నేతపరిశ్రమకు ప్రసిద్ధి. ఇది లంకాషైరు మండలములో నున్నది. దీనిసమీపముననే లివర్ పూల్ అను రేవుపట్టణము గలదు.

14. లీడ్సు:—ఇదియార్కుషైర్ బొగ్గుగనుల సమీపముననున్నది. ఇది ఉన్ని పరిశ్రమకు ప్రసిద్ధి.

15. హల్:—ఇది చేపలవేటకు ప్రసిద్ధి. ఉన్ని వ్యాపారమునకు ప్రసిద్ధి. ఆస్ట్రేలియా, న్యూజిలాండు దేశములనుండి ఉన్ని ఇచ్చటకు దిగుమతి అగును.

(సశేషము)

---

# స్త్రీనీతిరత్నావళి

కీ. శే. శ్రీ మన్మహోపాధ్యాయ బ్రహ్మశ్రీ శ్రీ కల్లూరి వేంకటరామశాస్త్రిగారు

(ఏప్రిల్ 1905)

(కుమారికి జనని యుపదేశించినట్లు భావించి సులభశైలిని నాచే రచియింపబడిన యీపద్యంబులు స్త్రీజనోపయోగంబులు గావున స్త్రీజనోపయోగంబగు నితర పత్రికారత్నంబులయందు బ్రకటింప తత్పత్రికాధిపతులు ప్రార్థితులు.)

1. బడలిక నుస్సురుస్సురని వచ్చినభర్తఁ దెల్పకమ్మ! నీ
యిడుములు, పాదశుద్ధికొఱ కిచ్చి జలంబును దాళవృంతమున్
వడిఁ గరమందుఁ బూని సునువాన్పునఁ జేరిచి, సేదదీర్చి, నీ
వడుగుల నొత్తి, సౌఖ్యముల నందఁగఁ జేయుము మానినీమణీ!
2. వరు డొకవేళఁ దిట్టినను వైఁబడి నీ వెదురాడ కమ్మ! యె
వ్వారు పతిభక్తి నుండుదురో వారికి ముక్తి ఫలించుఁగా మనో
హరు నిరతంబు నీదు మనసార భజింపుచుఁ గన్నతల్లి! మం
దిరశుభలక్ష్మినాఁగ నవనిన్ యశ మొందుము మానినీమణీ!
3. మఱఁదులనెల్ల సోదరులభూడ్కిఁ బ్రియంబుగఁ జూడు మమ్మ! యెం
దఱు నినుగూర్చి దూషణ మొనర్చిన నీదగు సత్ప్రవర్తనం
బెఱుఁగని మూఢు లాడురుగదే కొదువేమి భవచ్చరిత్రకున్?
జఱుతల శ్రేయ మీవు పరిశీలన చేయుము మానినీమణీ!

"భారతి"నుండి

---

# చిన్నబిడ్డల చిత్తవృత్తులు

(వెనుకటి సంచిక తరువాయి)

బాలకవి అన్నాప్రగడ వీరరాఘవయ్య.

**అనుకరణ :—**

క్రీడక్రియ తరువాత చిన్నబిడ్డల జీవితములో ముఖ్యముగా గమనించదగినది యనుకరణము. అనుకరణమనగా నితరులు చేసినట్లుచేయుట. దీని చిహ్నములు బిడ్డల బాల్యదశనుండియే యగపడును. పలక పుస్తకములను దీసికొని బడికిపోవు తన సోదరిపద్ధతిని, బాలుఁడనుకరించి యాచరణ రూపమున వెలువరించును. తానుగూడ నామెవలెనే బడికి వెళ్లుచున్నట్లునటించును. బాల్యదశ సగము గడచిన పిదప మరింత ప్రబలమై వేషభాషలలోను, నడవడుల

లోను, తగువిధముగు మార్పుల నొందును. ఇంతియేగాక ఇది స్వీయానుభవనమును కర్తచే గ్రహింపఁజేయును.

అనుకరణ - పరిసరప్రాంతముల ప్రభావము :—

అనుకరణమునకును, పరిసరప్రాంతములకును, తీరని సంబంధము గలదు. పరిసర ప్రభావము లేక యనుకరణముద్భవింపఁజాలదు. పారంపర్యమున లేని స్వభావము పరిసర ప్రాంతములం దలవడునని మన మొప్పుకొనగలిగినచో నది కేవలము అనుకరణమూలముననే గాని మరిదేనిచేతను సంభవించదని మనము విస్పష్టముగా జెప్పగలము. కావుననే తలిదండ్రులయు, నుపాధ్యాయులయు, విధి యీ యనుకరణ విషయములో ముఖ్యపాత్ర వహించును.

అనుకరణ - అన్వేషణ :—

అనుకరణమునుండి యన్వేషణము జనించినదనియు- కాదు- అన్వేషణమునుండియే యనుకరణము జనించినదనియు, శిశుమనస్తత్వశాస్త్రవేత్తలు భిన్నాభిప్రాయులైయున్నారు. ఏదియెట్లున్నను మొదటి వాదమే బలవత్తరమైనదని మన మొప్పుకొనకతప్పదు. ఏలనన, ఆరుమాసములు రాగానే అనుకరణము ప్రారంభమగుచున్నది. అప్పుడన్వేషణరాజాలదు. కాని యీ యనుకరణము క్రమక్రమముగ దినదినాభివృద్ధి గాంచినపుడిదియే యొక యన్వేషణగా మారును.

అనుకరణములలో రకములు: —

అనుకరణములలోపలురకములుగలవు. కాని వానిలో ముఖ్యమైనవానినిమాత్రమే పేర్కొనుట సముచితము. బిడ్డల శైశవదశలో జనించుననుకరణము ప్రయత్నరహితానుకరణము. అనగానే ప్రయత్నము లేకయే యనుకరించుట. ఎట్లన, నితరులేడ్చినపుడుగాని, నవ్వినపుడు గాని, శిశువు గూడ నట్లేచేయును. ఇందు శిశువునకు జ్ఞానముగాని, అనుభవముగాని లేదు. ప్రయత్నానుకరణము బిడ్డలకు కొంచెమూహ తెలిసినపిదప గోచరించును. ఇది సునిశ్చితమైన కోర్కె యుండిననే తప్ప జరుగజాలదు. దీనికి ముఖ్యముగ ప్రాథమిక విద్యావిధానము నందధిక ప్రాముఖ్యము గలదు. నాటకానుకరణము నాలుగైదేండ్లనుండి వృద్ధినొందును. ఇది కల్పనాశక్తికి తోడ్పడును.

అన్నిటికంటె ముఖ్యముగ బిడ్డల నడవడులలోను, చిత్తవృత్తులలోను, నుచిత పరివర్తనము గలిగించునది యాదర్శానుకరణము. బిడ్డలు తమ పరిసరప్రాంతములలోనేగాక, తామితరములైన యవకాశములందు గన్నవారి, విన్నవారి, నడకలననుకరింతురు. కావున దీనియందుపాధ్యాయుని కృషి పరామర్శింపదగినది. ఎందుకనగా ప్రాచీనవిద్యాపద్ధతులేగాక నవీన విద్యాపద్ధతులుగూడ కొన్ని యనుకరణపైనాధారపడియున్నది.

జిజ్ఞాసా-కుతూహలము —

జిజ్ఞాసకు, కుతూహలమునకును, కొన్ని స్వల్పభేదము లుండినను మన సత్వశాస్త్రవేత్తలు వీని రెంటికిని సమానభావము నిచ్చిరి. బిడ్డల సహజప్రకృతిలోని కుతూహలమే కౌమారదశలో తగు మార్పుల జెంది, జిజ్ఞాసగా పరిణమించును. ఇందు ఆశ్చర్యమను మనోవికార మిమిడియుండును, చిన్నపిల్లవానిలో నుండు జిజ్ఞాసకు విమర్శనాపూర్వకజ్ఞానమేమియు నుండదు.

ఉపాధ్యాయుడు కథ చెప్పునప్పుడు, వివిధ ఘట్టనలలో బిడ్డల ముఖ్యచిహ్నములను బట్టి గమనించుచున్నను, కథ చెప్పుచు, మధ్య ఆపినప్పుడు, ఆ కథను పూర్తిచేయు వరకును బాలుర యందుండు కుతూహలము ముఖ్యముగా గమనింపదగినది. ఇంతయేల ? తల్లి బిడ్డనెత్తుకొని లాలించికథలు చెప్పుచు పాటల బాడుచు నన్నము దినిపించును. పైవానియందు కుతూహలమే లేనిచో నాతడు తల్లిమాటను వినసే వినడు. బాల్యమునందు తాను గాంచిన వస్తువులను, దృశ్యములను. కౌతుకముతో పరిశీలించిన శిశువు క్రమ క్రమముగా వానిని గూర్చి వింతవింతలగు ప్రశ్నలను వేయుచు, తన కుతూహలమును దేటతెల్లము గావించుచున్నాడు. ఇక విద్యాభ్యాస సమయమున నాకౌతుకమే జిజ్ఞాసయగును ఇది కొన్ని యెడల ననుకరణమునకు దారి తీయును.

నిర్మాణశక్తి —

చిన్నబిడ్డల చిత్తవృత్తులలో నిర్మాణమను మరియొక సహజప్రకృతి గలదు. ఇది బిడ్డల మూడవసంవత్సరము నుండియే ప్రారంభించును. బిడ్డడు తానాడుకొనుటకు చింతగింజలు, రాళ్లు, పుల్లలకట్టలు, మొదలగునవి ప్రోగుచేయుచున్నాడు. అతడెదిగినకొలది ఇదిగూడ వృద్ధినొందును. తపాలాబిళ్ళలను, పటములను ప్రోగుచేయుట- సుందరతమములగు వస్తువులను కూడబెట్టుట - మొదలగు వానియందు బిడ్డలకు కుతూహలముండును. గాన దీనిలోని శక్తి కుతూహలమునకు మార్గమగును. ఈ నిర్మాణశక్తి విద్యావిధానమున చాలవరకు ఉపయోగింపబడవలసి వచ్చును. కళాప్రయత్నమనేగాక, బిడ్డల భావిజీవితమున నిదియొక దైనికసమస్యగా మారవలసి వచ్చునని నొక్కి వక్కాణింపక తప్పదు. (సశేషము)

---

# రెడ్ క్రాస్ సంఘము

అరసాడ భానుమూర్తి పట్నాయక్

రెడ్ క్రాస్ సొసైటీయనునది ఆంగ్ల నామము. దీనినాంధ్రమున "అరుణధ్వజ సంఘము. ఎఱ్ఱసిలువసంఘము" అను నామమ్ములతో వ్యవహరింపవచ్చును ఎఱ్ఱసిలువుగుర్తునుబట్టి యీ సంఘము క్రైస్తవమత సంబంధమైనదని కొందరపోహపడుచున్నారు కాని ఇది యేయొక్క మతమునకుగాని, యేయొక్క తెగకుగాని, యేయొక్క జాతికిగాని, చెందక సర్వమతములకును, సర్వమానవులకును సర్వజాతులకును, చెందినయొక అంతర్జాతీయ సంస్థ. (International organisation) విశ్వమానవ కళ్యాణమే యీ సంఘముయొక్క ముఖ్యాశయము.

ఈ సంఘమును స్థాపించిన విఖ్యాత పురుషుడు సర్ హెన్రిజూయెంట్. ఇతడు స్విడ్జర్లండు దేశస్థుడు ఇతడీసంఘమును 1864 లో స్థాపించెను. యుద్ధములలో గాయపడిన వారికి బరిచర్య సేయుటయే

దీని ముఖ్యోద్దేశము. అనేకమంది యువకులు తమ తలిదండ్రులను, ఆలుబిడ్డలను వీడి కదనమునకు కదలి క్షతశరీరులై పోరాడుచున్న సమయమున వారికి తగిన గాయముల కౌషధసేవచేయుటకు, నాకలి దప్పుల నణచుటకు, నీరెడ్‌క్రాస్ సంఘము వారొకవంక శత్రువుల ఫిరంగులు పిడుగులవలె పడుచున్నను, లక్ష్యముచేయక క్షతశరీరులను క్షణకాలములో క్షేమప్రదేశమునకుఁ జేర్చి చికిత్సఁ జేసియు, రణరంగమున కాహారపదార్థములనురయమునఁజేర్చియుఁ, బ్రాణములయందాశవీడి మహాసేవనుజేసి కీర్తిని వడసిరి.

యుద్ధము ముగిసిన తరువాతకూడ ఈ సంఘ మంతరించక విశ్వమానవకల్యాణమునకును, సర్వమానవ సౌభ్రాతృత్వమునకును, ప్రయత్నించుచు వచ్చినది. దాదాపు ప్రపంచమునందలి సంఘములన్నిటియందును శాఖలు స్థాపించబడినవి. ఇప్పుడీ సంఘమున కోట్లకొలది సభ్యులు గలరు. ఈ సభ్యులలో పెక్కురు జమీందారులును, కోటీశ్వరులును ఉన్నారు.

దేశములోని ప్రజలప్పుడప్పుడు అనారోగ్యమునకు, ఆకస్మిక విపత్తులకు లోనగుచుపీడింపబడు చున్నారు. అట్టి పీడితుల కీ సంఘము తన శక్తిని వినియోగించి చందాలు వసూలుచేసి అన్నాతురుల కన్నమును అనారోగ్యుల కారోగ్యమును చేకూర్చుచు దేశదారిద్ర్యమును తొలంగజేయుచున్నది.

ఈ సంఘమునకు చందాలమూలమునను, విరాళములవలనను ప్రభుత్వము వారిచ్చు గ్రాంట్లవలనను, ధనము ధారాళముగ వచ్చుచున్నది. ఈ ధనము ప్రజా వినియోగము చేయబడుచున్నది. ఆహా! ఇట్టి సంస్థలలో పనిచేయువారేగదా ధన్యాత్ములు!

జూనియర్ రెడ్‌క్రాస్ సంఘము:—

ఇది అంతర్జాతీయ రెడ్‌క్రాస్ సంఘము యొక్క యుపశాఖ. ఈసంఘములో 18 సం॥ వయస్సుకంటె మించని బాలబాలికలే సభ్యులుగా నుందురు. అందువలననే దీనిని జూనియర్ రెడ్‌క్రాస్ సంఘమని యందురు.

ఈ సంఘము సాధారణముగ ప్రాథమిక పాఠశాలలలో నేర్పాటుచేయబడును. బాలురలోనే కార్యదర్శి, కోశాధికారులు, నియమింపబడుదురు. (ఇదిపాఠశాలాధికారి యొక్క ఆధిపత్యముక్రింద నడుపబడును.) వీరుచేయుపనులు-ఇవి మూడువిధములు:-

I. ఆరోగ్య పరిశుభ్రాభ్యాసములు నేర్చికొనుట:-ఇందుకుగాను వీరనుదినము ఆటలాడుట, కసరత్తు, డ్రిల్లుచేయుట, తమ పరిసరములను శుచిగ నుంచుకొనుట, మంచిదుస్తులను ధరించుట, శుద్ధజలమును త్రాగుట, మొదలగు నారోగ్య మార్గముల నవలంబించుట, ఇతరులచే నవలంబింపఁజేయుట.

II. రోగులకును అనాథులకును, సేవచేయుట:-ఇట్టిసేవకుగాను ప్రథమచికిత్స మొదలగునవినేర్చి, రోగార్తులకును, గాయపడినవారికిగాని, నౌషధసేవచేయుట. పల్లెలలో నారోగ్య ప్రచారము సలిపి పల్లె పరిసరములను, గృహములను శుచిగా యుంచునట్లు ప్రజలకు ఉద్బోధించుట. ప్రత్యక్షముగ గ్రామము శుభ్రతను చేసి చూపుట. అనాథులకును, క్షుధార్తులకును తగు సదుపాయము లొనర్చుట.

iii. అంతర్జాతీయ స్నేహభావము:— ఇది అలవడుటకుగాను సభ్యులు తయారు చేసిన చేతిపనులు, చిత్రించిన చిత్రములను వ్యాసములను, చిత్రవస్తువులను, యితర దేశముల కంపించుట. అట తయారైన వానిని తెప్పించుకొనుటయు చేయుటచేత అన్యోన్య స్నేహ మలవడును

ఈ సంఘము లనేకచోట్ల స్థాపించబడినవి. ప్రతిజిల్లాకు నొక్కొక్క శక్రటరీని నియమించి కార్యక్రమమును చక్కగా జరుపుచున్నారు. వీటియన్నిటికిని ఢిల్లీనగరము కేంద్రస్థానము. ఈ సంఘసభ్యులు తమకు కావలసిన పాత్తములను మెద్రాస్ జూనియర్ రెడ్ క్రాస్ సొసైటీ (Madras) నుంచి తెప్పించుకొనవచ్చును. ఈసభ్యులు చందాల నీయనవసరములేదు. కాని తమ తల్లిదండ్రు లప్పుడప్పుడు మిఠాయివగైరాల కిచ్చిన డబ్బునుకూడబెట్టి సంఘమున కివ్వవచ్చును.

ఈ సంఘములవలన బాలుర కైక్యమత్యము, ఆరోగ్యము విశ్వమానవ సోదర భావము మొదలగు సద్గుణము లలవడును. ఇట్టి సంఘమును స్థాపించిన పుణ్యపురుషుం డెంతధన్యుడు ?

షరా —ఈ జూనియర్ రెడ్ క్రాసుసంఘములను ప్రతిపాఠశాలలోను నెలకొల్పుటవలన పైన వివరించిన సద్గుణములలవడుటయే గాక, గ్రామస్థులకు ఉపాధ్యాయులయందు అపారప్రేమ జనించి తమ బాలబాలికలను అనుదినము బడికిపంపుదురు. అందువలన కలుగు లాభములు విదితములే ! కావున ఈ సంఘములను నెలకొల్పగ లందులకు సోదరోపాధ్యాయులను ప్రార్థించుచున్నాను.

* * *

[డాక్టరు శ్రీసుబ్బారెడ్డిగారు (సెక్రటరీ జె. ఆర్. రెడ్ క్రాసుసొసైటి విశాఖపట్నం జిల్లా) ఈ వ్యాసమును ఆమూలాగ్రము చదివి ప్రథమ బహుమాన మొసంగిరి.)

---

# విద్యాప్రచారపు పాట

రచయిత:—కె. జేకబ్, టీచరు-లేబరుస్కూలు-లేపాక్షి

(ఇంగ్లీషు బ్యాండు వరుస)

1. బాలులార రండి - ఏగుదము వేగ మనము
బాలికలగూడి - బడి - కేగుదము త్వరగరండి॥ బాలు॥
2. వినుడి కనుడి విద్య - విలువ దెలిసి మనుడి
వదలదెన్నడు మనల - నిక - వలనుగాదు దొంగిలింప॥ బాలు॥
3. ఆట పాటలు నేర్వ - పాఠములను చదువ
మాట మంచి గలిగి - మన - మూఢతనము దొలగునిక॥ బాలు॥
4. మంచి గుణము గలుగు - ఎంచి చూడ మనకు
మందమతులు వెడలు - గన - డెందము వెలుగొందజేయు బాలు॥

5. పరదేశమందు మనకు - బంధు మిత్రులఁగూర్చు
పోషణంబు కులము - చాల - వాసికెక్క నెలయఁజేయు॥ బాలు॥
6. వినయమబ్బు నండి - విద్య వలన నుండి
వినయమునను గనుడి - చాల - ధనము గలుగు వినుడి॥ బాలు॥
7. విద్య నేర్వని మనల - వింత పశువు లనుచు
వంద్యు లనుట వినగ - హీన - వంతమనుచు నెఱిగి వేగ॥ బాలు॥
8. దాసు యాకోబు పంతులు - వ్రాసి తెలుపు నీతి
ఆశతోడ నేర్చి - మన - మందర మిల నడువఁదగును॥ బాలు॥

(Copyright to the author)

---

# హెచ్చరిక

కొమరవోలు శ్రీరామా హిందూఎలిమెంటరీ పాఠశాలవారు మొన్నటిఆరోగ్య వార ప్రదర్శనసందర్భములో ఆపాఠశాలా ప్రధానోపాధ్యాయులైన శ్రీ కొడాలి దామోదరయ్యగారిచే రచింపఁబడిన "చిద్విలాసము" అను ఆరోగ్యవిషయికమైన నాటకమును ప్రదర్శించినట్లును, ఆనాటకమును ప్రచురింపవలసినదిగా రామా అండ్ కో., వారిని కోరినట్లును, తెలియుచున్నది. కాబట్టి ఆనాటకమును నాకు పంపునెడల దాని యుపయోగమును గుర్తించి మాపత్రికా ముఖంబున వీలునుబట్టి ఒక్కసారిగనో, సశేషములుగనో, ప్రకటింపగలమని శ్రీ గ్రంథకర్తగారికి తెలియజేయుచున్నాము.

—సంపాదకుఁడు.

---

# చిన్నమనవి

వెనుకటి సంచికలో నేను కోరిన ప్రకారము చాలమంది యుపాధ్యాయుల నుండి "పొడుపుకథలు" మిక్కిలిగావచ్చినవి. వాని నన్నిటిని సరిచూచి ఒక్కేదండగాఁగూర్చి ప్రకటింపవలెనని మాతలంపు. అందుకు ప్రస్తుతము వ్యవధిచాలనందున ఇది కొనసాగలేదు. వచ్చే నెలసంచికలో పంపినవారి పేర్లతో నివియన్నియుఁ బ్రకటింపఁబడఁగలవనియు, సదరు వ్యాసకర్తలు దీని కన్యథాభావింపకుందురనియు, నాచిన్న మనవి.

—సంపాదకుఁడు.

# కరువు దండయాత్ర

(సింహా)

"విధినాథుడొచ్చి వీపుపై తాండవింప వీర్రాజునే మంటావు పేరాశా" అని భయపడింది ప్రపంచకరువు దండయాత్రను చూడగానే. ఎచ్చటచూచినా కరువే! ఏదిచూచినా కరువే! ఏనోటపలికినా కరువే! ఇందు గల దందులేడను సందేహమువలదు" అన్నట్లు "జగమంతా రామమయం" లాగ కరువుమయం అయింది జగమంతాను చలామణీలోవున్న మాట కూర కరువు కరువుకిలొంగి పోయాయి తినుబండారములు, కట్టుకొనే గుడ్డలు, ఉండేయిండ్లూ, ఇతర దినచర్య పరికరములుకూడాను కరువుకి బలం చేకూరింది. బాగా పుష్టిగా పెరిగింది. అభేద్యబలం చేకూరగానే కరువు తన ప్రభావాన్ని వేనోళ్ల చాటుకుంటూ తన ప్రతాపాన్నిచూపి ప్రపంచాన్నిమాడ్చి దగ్ధం చెయ్యాలని బయలుదేరింది దిగ్విజయ సంకల్పంతో. భ్రమించింది కరువు అంతాతనలోనే వుందని గర్వించింది. బీదలు, భాగ్యవంతులు, (అంటే ప్రకృతంలో వర్తకులు) వ్యవసాయదార్లు, ఉద్యోగులు, నౌఖరులు, అంతా వక్కటే అనుకుంది ప్రారంభించింది దండయాత్రా ప్రయత్నం ప్రథమంలో వర్తకులదగ్గర తినుబండారములు, కట్టుగుడ్డలాది వర్తకులు కరువుతాకిడిని చూచేరు, ఆశ్చర్యపడ్డారు ఎదుర్కొనేందుకు వుపాయమన్వేషించారు. ఎదిరించడానికి మార్గంలేదన్నారు రాజీపడి ఆదరించారు, కరువుమీద సాకుచెప్పి ధరలు బిగించేరు. నిల్వలువేసేరు లంచాలు పెట్టేరు. లాభాలుతీసేరు. దాంతో కరువు వారిమీదదండయాత్ర చేయలేకపోయింది. ఆశాభంగంపొంది వారి సహాయంతో బీదలపై విరుచుకుపడింది. వారు హాహాలెత్తి నారు మాడుకుపోతామనుకున్నారు. "ఆపదలందు ధైర్యము" అను సుభాషితాన్ని జపించేరు. దినచర్యావసరములకు కూలీలు ఒడ్డవాగ, వగైరా వగైరా అందరు సమ్మెకట్టు, కరువో కరువో అని అని బొబ్బరెట్టేరు, డబ్బు బిగించేరు. వారి ధైర్యం చూచింది. వారికేకలకు ఎదురుదాడికి భయపడింది కరువు, వారిని కూడావెంటబెట్టుకు చూదామని వ్యవసాయదార్లవైపు రథంతోలింది. వీరిదండయాత్ర బయలుదేరిన వర్తకులపై పడినపుడే తెలుసుకున్నారు వంట కామందులు. నిల్వలుచేసుకున్నారు. ఆసంగతి గ్రహించి ఓడిపోవుటకంటె ఒసిలిపోవుట మంచి అనుకుని మరిపోనిలేదు రథాన్ని. మారుమొగం పెట్టి ఆదేపోవడం. తిన్నగా వుద్యోగులమీద రణదుందుభి మ్రోయించింది. ఉద్యోగులు సూక్ష్మబుద్ధులుగదా! ఎదరిబలాన్ని తక్షణం గుర్తించగలిగారు. జీతాలు హెచ్చించుకున్నారు. యుద్ధభత్యాలురాసుకున్నారు, కరువుబత్తాలు తీసుకున్నారు, T. A లు పెంచుకున్నారు. ధనం పుష్కలంగా ఖర్చుపెట్టేరు. కాని కరువుబలంమాత్రం క్షీణదశకు రాలేదని గ్రహించేరు. కరువును జయించేమార్గమేదా అని చింతించేరు. తట్టింది బుర్రకాలోచన. తయారుచేసేరు శేషను సప్లయిబాంబు. ప్రయోగించేరు కరువుమీద. కరువు మొర్రోమంటూ వెన్నిచ్చి పరుగు ప్రారంభించింది. కాని ధైర్యంవీడలేదు తిన్నగానౌకర్లపై లంఘించింది. పెద్దపులిలాగ నౌఖర్లు వుద్యోగుల ముఖాలు తెకా తెకాచూచేరు ప్రాణావశిష్టులయ్యేరు. యిదొక మాదిరిగా కరువు ప్రభావం ఉద్యోగులకు కూడా తగిలింది. "తనవరకు వచ్చినగాని తనకు తెలియదట" ఎవరి నౌఖర్లకు వారు శేషనుసప్లయి బాంబు నిచ్చేరు. కరువుపై ప్రయోగించమన్నారు కరువు భయపడింది. ఎక్కడకు వెళ్లినా పరాజయం సంభవించిందనుకుంది. ధైర్యం వీడలేదు. ఎన్ని పరాజయములైన తాత్కాలికమే అనుకుంది. తుదివిజయం తనదని పట్టువిడలేదు. ఆత్మలో సిగ్గుచేత మణివున్న పాములాగ తలవంచి ప్రాకింది. స్థిరవిజయంకోసం వెతికింది. దండయాత్రలో సఫలీకృతమైంది. శ్రమకోర్చి వ్యర్థంగా, ఆలోచనాహీనంగా, దేశం తిరిగినందుకు విచారించింది. దొరికినస్థావరం స్థిరపర్చుకుంది. ఎక్కడ? ప్రాథమికోపాధ్యాయుని నెత్తిమీద. ఉపాధ్యాయుడు తనను ఎదుర్కొనలేడని ధైర్యం చిక్కబట్టుకుంది. ఆ భాగ్యుడు ఉపాధ్యాయుడు తనకు తాను తెలుసుకొనలేక ఎదిరిబలం చూచి కూడా "నాయనారాలికి ఏం గుగుబిడలు నాకేం కొదువ" అన్నట్టు అందరిలాగా ఎదుర్కుందాం అనుకున్నాడు కరువు సంగతి గ్రహించింది. గంభీరంగా గర్జనచేసి లంఘించి ఓ అభాగ్యజన్మవమా! నీబలం నీవు చూచుకో, నీవు వర్తకుడవా? కావు. వ్యవసాయదారుడవా? కావు కూలివా? కావు, వుద్యోగివా? కావు నౌఖరువా? అనామధేయుము.

అందుకూ నోచుకోలేదు. చూడు! మరి! యుద్ధం ప్రారంభించి నాలుగేళ్ళి అయిదేళ్ళు వచ్చాయి. నీ కెవ్వరైనా యుద్ధభత్యం ఉందా లేదా అని అడిగి ఇచ్చినవాళ్లున్నారా? నాదండయాత్ర ప్రారంభించిన దాడి ఎవరైనా కరువుభత్యాం అనుభవగతము చేసుకో మన్నారా? నాతో ఎదిరించుటకు నీకేవంకనైనా సహాయం చేసేవారేరి? అందుచేత నీబుద్ధి విరమించు కోఅంది. ఎట్లా విశ్వాసఘాతకంచెయ్యను. ఇంక్రిమెంట్లు బోర్డువారిచ్చేరు. జాగ్రత అన్నాడు వుపాధ్యాయుడు. కరువుకి నవ్వు వచ్చింది. భూమి బ్రద్దలగునట్లు అట్టహాసం చేసింది, జడిపించింది. దెప్పిపొడిచింది. ఏదీ చూడు మాష్టరు వృధాగా చెడకు మిాజీతాలు నేనెరుగనా? ఒకనెలలో 10 తేదీని, మరొకనెలలో 30 తేదీని, మరొకనెలలో మరెప్పుడో అందుతాయి. నీగొడవ ఎవళ్ళకి కావాలి. జీతం చాలక మాయచేస్తున్నావని నారాజ్యంలో నిన్నెవళ్లు నమ్మతారు. నీకేది పరపతి “అయ్యవారినట్లులు” సామ్యం ప్రజలకీ, వర్తకులకు, తెలియదనుకున్నావా. యిక నిన్ను వుద్ధరించి నీకు సహాయపడేవాళ్ళేరీ? అని హుంకరించితే ఉపాధ్యాయునకు ఒళ్లు మండింది. మేమంత నీతిబాహ్యులమా? నాబలం చూడు అన బోతుంటే పిశాచమువలె పండ్లిగిలించి నీకు శక్తివుంటే చూడు. మాటలు పనికిరావు.

కాముకో! అమాయకుడివి, నాకు నిన్నుజూస్తే జాలివేస్తూంది. నాపరాజయం ఏలాగో నీకుతెలుసా? ఓసి వెర్రిమొఖమా! రేషను సప్లయిబాంబు నీదగ్గరుండాలి? ఉందా? ఉంటే నేను జోహారవుతాను. లేదా? చూడు నా ప్రతాపం అంటూ విరుచుకపడింది. గోలెత్తేడు ఉపాధ్యాయుడు. డిపార్టుమెంటును సప్లయిచేయమన్నాడు. మేనేజిమెంటు దగ్గరకు పొమ్మన్నారు. మేనేజిమెంటును ప్రార్థించేడు. తిరస్కరించేరు. మిా కర్మ అన్నట్లు మౌనం వహించేరు. “మొగిగొరెత్రి వుచ్చిచచ్చినదన్న” సామ్యం కండ్లముందు తాండవించింది. నిరాశపొందేడు. న్యాయపాలకులు, శ్రీగవర్నమెంటువారున్నారని జ్ఞప్తివచ్చింది, ఆశ మొలకెత్తింది. గంపెడాశతో రెవెన్యూ డిపార్టుమెంటును ఆర్థించేడు. దరిచేరవద్దన్నారు. గ్రామంలో సానుభూతిగోరేడు. మాకేం కావాలన్నారు. కాళ్లు కృంగినాయి. వళ్లు వణికింది. కళ్లు చీకట్లు క్రమ్మినాయి. తలతిరిగింది. కరువుకి జయం సిద్ధించింది. ఉపాధ్యాయునిది అపజయం కరువుకి లొంగేడు. బానిసయ్యేడు. కృశిస్తున్నాడు. మలమలమాడుతున్నాడు. ఎవరు? అభాగ్య శిరోమణి, నిస్సహాయ నికృష్టజీవి, బిరుదాంకితుడు, ప్రాథమికోపాధ్యాయుడు—

## కరువు రాజ్యపాలన.

ప్రాథమికోపాధ్యాయులపై ధ్వజమెత్తింది. నిరంకుశత్వాన్ని చూపుతూంది. అనుచరుల కాజ్ఞాపించింది. నాలుమూలల నొక్కేసింది అంటే అంతా కరువుని జయించిన వాళ్ళవడాన్ని ఉపాధ్యాయుడు అందరికి జోహార్ అయ్యేడు, జోహుకుంఅన్నాడు. పట్టరానివాళ్ళకాళ్లూ పడుతున్నాడు. సహాయశూన్యం, పైగా విపరీతం. కరువుసాకుగా, ఆయుధంగా పెట్టుకున్నారు. అనేకరకాలు, అందరూ ఉపాధ్యాయులపైననే, ఏలాగంటారేమో? పాలనా విధానంలో ఒకటిరెండు అనుభవ సంఘటనలు చెపుతా, అంతాఅలాగే, తలోవిధంగాను వుంటుంది. బహుపరాక్ చిత్తగించవద్దు. మా గ్రామ కరణంగారు మాస్టరువద్ద ధాన్యం కొంటూనని పుచ్చుకున్నారు సొమ్ము. జోహార్ అన్నాడు నమ్మి యిచ్చేడు. ధాన్యము లేవు, ఏమండీ అంటే కరువు అన్నాడు. సొమ్ము మాటో? కరువు ఉభయభ్రష్టుడయ్యేడు మాస్టరు ఏమైన ధైర్యం చిక్కబెట్టి గట్టిగా అడుగుదామంటే పైకి రాసేస్తారు. “ఎద్దినింది అంటే గాటకట్టు” అన్నట్లుంటుంది. ఉపాధ్యాయునిపై అధికారం ఉపాధ్యాయునికంటే దాంట్లో అంతా ఉదాశీనమే. బలే బాగుందన్నారు. మునసబుగారు. బండి కావలసి చెప్పుకున్నాడు ఆవుపాధ్యాయుడే సహాయం అర్థించేడు మునసబుగారిని ఎవళ్లూ కట్టరన్నాడు (లోపాయికారిగా వద్దన్నారో తెలియదు) సులువు చూచేడు. బిగించేడుఅద్దె అయ్యేడు మాస్టరు దివాలా! ధర్మవిరుద్ధం అన్నాడు తడవుగా కరువుని చూపేరు మునసబుగారు గ్రామ యజమాన్ల తమాషా చూచేడు పెత్తనదారు ఉపాధ్యాయుడూరి కెళ్లాలి 12 గంటల బస్సులో ఎవరిని నమ్మక ఖుద్దున బండీచెప్పుకున్నాడు. బండిని పొమ్మన్నాడు పెత్తనదారు తను మిల్లు కెళ్ళాలి 7గంటలకు వస్తేరా! పోతేపో అన్నారు. ఏం అంటే కరువన్నాడు. అద్దెకి తగువు. అనుకున్న దొకటి నోటు మారుస్తానని తీసుకున్నదొకటి. దగా జరిగిందన్నాడు ఉపాధ్యాయుడు కబర్దార్, కరువు అన్నాడు పెత్తనదార్, ఇల్లావుంది కరువు రాజ్యంలో వుపాధ్యాయుని అవస్థ తప్పేమి, డిపార్టుమెంటువారు, మేనేజిమెంటువారు, ఉదాశీనంగా ఊరుకొని తల్లి

పిల్లలను వినిపట్లు ఉపాధ్యాయునిపై కరువుని వద లితే వూళ్లోనాసానుభూతి యీ కరువురాజ్యములో

### ముగింపు

మేనేజిమెంటువారి ఉదాసీనము, డిపార్టుమెంటు వారి నిరసన, రెవెన్యూవారి ధిక్కారణ, గ్రామయజమానుల నిరభిమానము, గ్రామస్థులదగా! ఆహా కరువుకి గురియైన అభాగ్యుడు ఉపాధ్యాయుడా! బలేబాగు. నీఅభాగ్యజీవములపై ఎంత వెనుదన్నుతో కరువు దండెత్తి జయమంది సిరసావహము చూచుచున్నది? ఓ ఉపాధ్యాయుడా! "ఆపదలందు ధైర్యమను భర్తృహరి సుభాషితం జ్ఞప్తియుంచుకో! త్యాగము సమానముతో చూపు కష్టేఫలీ అందురు. పెదలు కరువుదేవతనే ప్రార్థించు. యుద్ధానంతరపునర్నిర్మాణమునందైన ఉపాధ్యాయున కిట్టి దుర్గతి కలుగకుండుగాక!

ఆశీస్సు.

సర్వేజనాస్సుఖినోభవంతు.

---

# సభలు - తీర్మానములు

## ఆంధ్రరాష్ట్ర ఎలిమెంటరీ టీచరు మేనేజర్ల ఫెడరేషను

### మండపేట, రామచంద్రపురం తాలూకా (తూర్పుగోదావరిజిల్లా.)

ఇందుమూలముగా యావదాంధ్రదేశమునగల అన్ని తాలూకా, జిల్లాల టీచరుమేనేజర్ల సంఘముల కార్యదర్శులకును, ఈసంఘ కార్యనిర్వాహకసంఘ సభ్యులకును, తెలిపి, కోరునదేమనగా

1. ఇందువెంట ది 14-11-43 వ తేదీని తెనాలిలో శ్రీ గోవిందరాజుల వెంకటసుబ్బారావుగారి ఆధిపత్యమున జరిగిన ఫెడరేషను సభాతీర్మానాదులను వాటిమహాజనసభాంగీకారమును పొందిన సంఘ నిబంధనలను మీకు పంపుచున్నాను.

2. ఈసంస్థ యావదాంధ్రమునగల టీచరు మేనేజర్ల పురోభివృద్ధికినిపనిచేసి, వారియొక్క కష్టసుఖముల నధికార్లకు ఐక్యకంఠమున నివేదించుటకు స్థాపించబడిన మీయొక్క సంఘము.

3. కావున నిబంధనల ననుసరించి అన్ని తాలూకా, జిల్లా సంఘములును, వ్యక్తిగత్తముగా టీచరు మేనేజర్లును, చెల్లించవలసిన రుసుములను చెల్లించి, యీసంస్థద్వారా మీకష్టసుఖములను తెలియజేయ కోరుచున్నాను.

4. ఈ సంఘవిషయము లెప్పటికప్పుడు మీకును, మీద్వారా యీ సంస్థయందుగల ప్రతి టీచరు మేనేజర్లులకును, తెలియగలందులకును, మీ పూర్తి చిరునామాను నాకు తెలియజేయుచు, వానిలోగల మార్పులనుగూడ యథావిధిగా ఎప్పటికప్పుడు తెలుపకోరుచున్నాను.

5. సంఘ కార్యక్రమాదులు ఎంతటి వ్యయప్రయాసలకైనను ఓర్చి ప్రతి టీచరు మేనేజరునకును తెలిపినదేగదా సంఘమున్నదనియు, పనిచేయుచున్నదనియు తెలియును. కావున యీ అవకాశమును నాకు కల్పించి మీరును నడుముకట్టి యీఅవకాశము వృథాచేయక పనిచేయుదురుగాకయని కోరుచున్నాను.

6. ఎప్పటికప్పుడు మీ సంఘసభలయందు కావింపబడు తీర్మానాగులను యీ సంఘమునకు తెలియజేసినచో, వానినెల్ల క్రోడీకరించి, అధికార్లకు పంపుటలోగల విలువను గుర్తించి అట్లు చేయకోరుచున్నాను.

7. మీ తాలూకాయందుగల బాలబాలికా కేంద్రసంఘముల కార్యదర్శుల చిరునామాలను అవి, జరుగు వారమును, వాని కధ్యక్షత వహించు అధికార్ల హోదాలనుకూడ తప్పక వెంటనే తెలుపకోరుచున్నాను.

8. మీవద్దనుండి వచ్చు అన్ని కాగితములపైనను, తాలూకాసంఘములైనచో, సదరు, తాలూకా జిల్లాలపేరులను, తప్పక వ్రాయకోరుచున్నాను. చిరునామా లిచ్చుటలో గ్రామము, పోష్టు, తాలూకా, జిల్లాలవివరములను స్పష్టముగా వ్రాయకోరుచున్నాను.

9 మీతో జరుపబడు ఉత్తరప్రత్యుత్తరములకు వెంటనే సమాధానము లిప్పించుచో ఎంతో వ్యయ ప్రయాసములను మిగిల్చినవారగుదురను విషయమును మరువకుందురుగాక ' ఇదియే ముఖ్యాతిముఖ్యమగు విషయము మీచే జరుపబడునవి కూడ అంతత్వరలోనే జరుగునని గ్రహించకోరుచున్నాను.

10. జిల్లాసంఘ కార్యదర్శులు తమజిల్లాలోగల బాలబాలికా రేంజీల తాలూకా జిల్లాసంఘముల యొక్క సంఘోద్యోగీయులయొక్కయు, కార్యనిర్వాహకవర్గముయొక్కయు, పూర్తిచిరునామాలను కూడ నాకు పంపకోరుచున్నాను.

11 ది 14-11-43 నాటి రాష్ట్రసంఘ సమావేశమునకు జిల్లాసంఘ ప్రతినిధులు రాని జిల్లాలనుండి సంఘనిబంధనలననుసరించి, సభ్యులు కోఆప్టు చేయబడిరి. మరల రాష్ట్రసంఘ సమావేశము జరుగునంతదాక వారాస్థానమున నుందురు. వలసివచ్చినప్పుడు జరుగు మార్పులనుగూడ తెలుపకోరుచున్నాను.

12. ఏ జిల్లాలోనైన స్థాపింపబడవలసిన తాలూకా లేక జిల్లాసంఘములున్నచో వెంటనే తెలిపి అవి స్థాపింపబడునట్లుచేయుటకు మీ సహకారము నాకు యివ్వగోరుచున్నాను. ఈ వుత్తరము చేరిన వెంటనే కోరినవిషయములను వెంటనే తెలుపుదురని నమ్ముచున్నాను. ఏసంస్థయైనను వలయు భోగట్టాలేనిచో సక్రమముగా పనిచేయకుండుటకు అవకాశము చిక్కును. కాన ఆలోటు చేయకుందురుగాకయని ముఖ్యముగా కోరుచున్నాను. పూర్తి వివరములు తెలిసిన ఎవరు వానిని పంపినను కృతజ్ఞతతో గైకొందును.

మండపేట,
17-11-43.

(Sd.) సి. హెచ్. కె. యస్. శర్మ,
జనరల్ శ్రెక్రటరీ.

## (ii) ఆంధ్రరాష్ట్ర ఎలిమెంటరీ టీచరుమేనేజర్ల ఫెడరేషను మహాజనసభ

ది 14-11-1943 ఉదయం గం. 9 ల నుండి తెనాలి శ్రీ సత్యనారాయణ టాకీసు హాలులో ఆంధ్రరాష్ట్ర ఎలిమేంటరీ టీచరుమేనేజర్ల ఫెడరేషను మహాజనసభ శ్రీ డాక్టరు గోవిందరాజుల వెంకట సుబ్బారావు L. M. & S వారి అధిపత్యమున జరిగెను. సభకు సుమారు 400 మంది సభ్యులు హాజరైరి.

ఈ సంస్థయొక్క నిబంధనలు, లోగడ కార్యనిర్వాహక వర్గమువారిచే తయారుకాబడినవి, ఆమోదింపబడెను. ఈసంస్థ యీసంవత్సరము తూర్పుగోదావరిజిల్లాలో నుండుటకును, యిట్లే ప్రతిసంవత్సరము ఒక్కొక్క సంవత్సర మొక్కొక్క జిల్లాలో నుండుటకు యేర్పరుపబడినది.

ఈదిగువ కార్యనిర్వాహక సభ్యులు యేకగ్రీవముగా నెన్నుకొనబడిరి.

అధ్యక్షుడు శ్రీ మంగిపూడి సూర్యప్రకాశరావుగారు B.A;B. Ed. పొడగట్లపల్లి, రాజోలుతాలూకా
ఉపాధ్యక్షుడు శ్రీ గన్నవరపు విశ్వేశ్వరరావుగారు, లంకలగన్నవరం.
ప్రధానకార్యదర్శి శ్రీ Ch. K. S. శర్మ, మండపేట.
సంయుక్త కార్యదర్శులు శ్రీB. పోతురాజుగారు,తాతపూడి. శ్రీY బ్రహ్మానందరావుగార్లు,కొమ్మనాపల్లి.
కోశాధికరి శ్రీ కొండ్రెడ్డి సూర్యప్రకాశంగారు, అంబాజీపేట. P O.

సభ్యులు - ఉత్తరవిశాఖపట్నం (1) శ్రీ బి. వెంకటరత్నం పాత్రోగారు, వెదుళ్ళవలస
(2) శ్రీ K. నరసింహసిద్ధాంతిగారు, చికాకోలు.
దక్షిణవిశాఖపట్నం (1) శ్రీ జె. అప్పలనరసింహులుగారు, అనకాపల్లి.
(2) శ్రీ కె. సోమన్నపట్నాయక్ గారు, సాలూరు.
తూర్పుగోదావరి (1) శ్రీ ఎ. వి. అప్పావధానులుగారు, సీతంపేట, రాజమండ్రి.
(2) శ్రీ జి. రుబేరుగారు, మాచవరం, రామచంద్రపురంతాలూకా.
పశ్చిమగోదావరి (1) శ్రీ వి. వి. వి. సుబ్బారావుగారు, ఇలపర్రు.
(2) శ్రీ జె. సూర్యనారాయణగారు. సింగవరం.

| | |
|---|---|
| కృష్ణా | (1) శ్రీ దెందులూరి లక్ష్మీనారాయణగారు, ముస్తాబాద. |
| | (2) శ్రీ సి. హెచ్. లక్ష్మీనారాయణగారు, బెజవాడ. |
| గుంటూరు | (1) శ్రీ బొగ్గరం వెంకటేశ్వర్లుగారు, బొగ్గరం. |
| | (2) శ్రీ కొప్పోలు అంకయ్యగారు, మామిడిపాలెం. |
| కర్నూలు | (1) శ్రీ జె. రామయ్యగారు, (2) శ్రీ ఎ. జార్జిగారు. |
| నెల్లూరు | (1) శ్రీ కొప్పోలు వెంకట్రావుగారు, నెల్లూరు. |
| | (2) శ్రీ డి. జానకిరామమూర్తిగారు, నెలూరు. |
| చిత్తూరు | (1) శ్రీ కె. వెంకటాద్రిపిళ్లెగారు, చిత్తూరు. |
| | (2) శ్రీ జి. యన్. రామచంద్రశెట్టిగారు, చిత్తూరు. |
| కడప | (1) శ్రీ జి. రామానుజయ్యగారు, కడప. |
| | (2) శ్రీ యస్. సుబ్బారాయుడుగారు, కడప. |
| బళ్ళారి | (1) శ్రీ కె. భుజంగరావుగారు, రూపనగుడి. |
| | (2) శ్రీ వై. లక్ష్మీనారాయణాచార్యులుగారు, దైవందిన్నె. |
| అనంతపురం | (1) శ్రీ జి. కోనేరిరావుగారు, అనంతపురం. |
| | (2) శ్రీ కె. వి. స్వామిగారు, తాడిపత్రి. |

ఒక్క ప్రాతినిధ్యమే వచ్చిన జిల్లాలనుండి రావలసిన 2 వ ప్రాతినిధ్యమును మిగతజిల్లాలనుండి రావలసిన 2 ప్రాతినిధ్యములను, కో ఆప్టుచేయుటకు తీర్మానించబడినది.

ఈదిగువ తీర్మానము లేక గ్రీవముగా నామోదింపబడినవి.

1. ప్రస్తుతయుద్ధమున ప్రభుత్వమువారికి సత్వర విజయము కలుగుగాక యనియు,

2. ఈ ఫెడరేషనును రిజిష్టరు చేయుటకును,

3. ఆయాజిల్లాల "యెసెస్మెంటులపై" 15% కు తక్కువకాని - మొత్తముగ్రాంటును ఆయా జిల్లాలకు ఎల్లాట్మెంటుచేయ అధికార్లను కోరుటకును,

4. ప్రభుత్వసిబ్బంది కియ్యబడుచున్న రేట్లప్రకారమే యెయిడెడు టీచర్లకు, టీచరుమేనేజర్లకు, యుద్ధ భత్యము లిప్పించ ప్రభుత్వమువారిని కోరుటకును,

5. యెయిడెడు బడులకు అదెగ్రాంటు లిప్పింప ప్రభుత్వమువారిని కోరుటకును,

6. 10 సంవత్సరములు సర్వీసుగల్గిన అన్ట్రయిన్డు టీచరుమేనేజర్లకు "పర్మనెంటు ఎగ్జంప్షను" నిప్పించ ప్రభుత్వమువారిని కోరుటకును,

7. బోర్డుయాజమాన్యమునుండి సబసిస్టంటుఇన స్పెక్టరునువారియొక్క పరీక్షాధికారములోనుండు ఎలిమెంటరీస్కూలు పాఠశాలలుగల చోట్లనున్న యెయిడెడు బాలురపాఠశాలలలో బాలికలను చేర్చుకొన నను మతి యిప్పించ అధికార్లను కోరుటకును,

8. నూతనముగా సవరింపబడిన నియమములప్రకారము సెకండరీగ్రేడు ట్రయినింగునకు స్కూలు ఫైనలు పోయినవారిని చేర్చుకొనుచున్నందున S. S. L. C. పరీక్షలోతప్పి హయ్యరుగ్రేడు ట్రయినింగైన "బోనఫైడు టీచర్లు" సెకండరీగ్రేడు పరీక్షకు వెళ్లునట్లు అనుమతింప నధికార్లను కోరుటకును తీర్మానించడమైనది.

సభకు శ్రీవేంకట్రామ కంపెనీ యాజమాన్యులు శ్రీయుత ఈదర వేంకట్రావు పంతులుగారును, తూర్పుగోదావరిజిల్లా యెయిడెడ్ టీచర్లయూనియను కార్యదర్శిగారును, విద్యాభిమానులైన యొకానొక యోగీంద్రులును కూడ హాజరైరి.

ఈ సంస్థవారిన్ని యాజమాన్యముల ప్రాథమికోపాధ్యాయుల పురోభివృద్ధికై వినియోగింపబడునట్లు మార్పవలెనని ఒక అభిప్రాయ మీయబడినది. ఉపాధ్యాయుల కష్టసుఖములనుగూర్చి పలువురును, వారి బాధ్యతాదులనుగూర్చి శ్రీయోగీంద్రులును ముచ్చటించిరి.

శ్రీ ఈదర వేంకట్రావు పంతులుగారు తాము గత 40 సంవత్సరములనుండి విద్యావిషయిక సంస్థ యందు పనిచేయుచు, తత్ సంస్థాపితుల ఆదరాభిమానములను పొందినందులకు మాత్రమే తమకృతజ్ఞతను

వెలిబుచ్చుచు, యీ ఫెడరేషనుకొఱకై తమ నికరాదాయమునుండి 5% విరాళముగా నిచ్చుచుంటిమనియు, తమపుస్తకములను పాఠశాలలో ఉంచమను ప్రతిఫలాపేక్ష యినుమంతయులేదనియు, అట్లు పెట్టమందుటకై తీర్మానమును గావించిన సంతోషింతుననియు, అంతేకాని ఫెడరేషనునకును తమకును యేవిధమగు సంబంధమును లేదనియు, నిష్కాపట్యముగా, హృదయపూర్వకముగా, నుడివిరి.

(శ్రీ) అధ్యక్షులు శ్రీపంతులుగారి సేవ నుగ్గడించుచు, దాని నన్యథాతలంచుట కూడదనియు, వారు గావించు గుప్తదాన పరంపరలో నిదియొకటియనియు, స్వార్థరహితమైనదనియు శ్లాఘించిరి.

సభకు ఉచిత బసభోజనాదికము లేర్పరుపబడినవి. కృతజ్ఞతాభివందనములతో సభ ముగిసినది.

సి. హెచ్. కె. యస్. శర్మ,
జనరల్ సెక్రటరి.

షరా — "ఆంధ్రరాష్ట్ర ఎలిమెంటరీ టీచరుమేనేజర్ల ఫెడరేషన్ మెమొరాండం ఆఫ్ అసోసియేషను" కు సంబంధించిన నిబంధనలయొక్క కాపీని కోరువారు జనరల్ సెక్రటరీగారికి వ్రాసి తెప్పించుకొనవలెను.

# టీచర్సు అసోసియేషను అముజూరు.

రామచంద్రపురం తాలూకా

(శ్రీ) రామచంద్రపురం రెంజీస్కూళ్ళ జూనియరు డిప్యూటీ ఇనస్పెక్టరు శ్రీ సేమాని వెంకటరామయ్యగారి ఆధిపత్యమున 4—12—43 తేదీన సమావేశమైనది. సభాసమావేశము దైవప్రార్థనతో ప్రారంభింపబడెను. సదరు సమావేశసందర్భమున జరిగిన యంశములు.

1. గతమీటింగు కార్యక్రమము చదువబడెను.

2. బోర్డు ఎలిమెంటరీ స్కూళ్ళు 12 ఎయిడెడ్ పాఠశాలలు 7 మొత్తం 19 బోర్డు ఉపాధ్యాయులు 37/45 హాజరు. ఎయిడెడ్ ఉపాధ్యాయులు 12/14 హాజరు మొత్తం హాజరు 49/59.

3. శ్రీ ఇనస్పెక్టరుగారు 1 వ తరగతికి గణితముమీద మాదిరిపాఠమును యిచ్చిరి.

4. IV. V. VI. VII. VIII, తరగతుల బాలబాలికలకు క్రొత్తసిలబస్ ప్రకారము వ్రాయబడ్డ జాగ్రఫీల గురించి బోధించిరి.

5. శ్రీ ఇనస్పెక్టరువారు ప్రస్తుత యుద్ధపరిసితులు బ్రిటీషువారికి కలుగుచున్న విజయములు, యుద్ధానంతరము రాజ్యాంగవిధానమును గురించి కయిరోలో శ్రీ చర్చిలుగారు, శ్రీ రూజువెల్టుగారు, శ్రీ ఛాంగ్ కైషేకుగారున్నూ సమావేశమై మాటాడుచున్నారనియు, తరువాత పర్షియాలో ముగ్గురున్నూ రష్యా ప్రధాని శ్రీ స్టాలిన్ గారున్నూ కలిసి మాట్లాడెదరని చెప్పిరి.

6. అనంతరము మన బ్రిటిషుప్రభుత్వమునకు విజయప్రాప్తికై సభ్యులందరు భగవంతుని ప్రార్థించిరి.

అముజూరు, 6—12—43.

అవసరాల రామారావు
సెక్రటరీ

# సభలు - తీర్మానములు

విశాఖపట్టణము ప్రభుత్వ బోధనాభ్యసన పాఠశాలయందు JR రెడ్ క్రాస్ సంఘము స్థాపించబడినది. ఈ సంఘము హెడ్మాష్టరుగారైన శ్రీ బెండపూడి రామమూర్తిపంతులు B. A, L. T., గారి అధిపత్యముక్రింద చక్కగా నడుపబడుచున్నది. ఈ సంఘమునకు శ్రీ. K. నరిసింగరావుపంతులు B.ABED గారిని కౌన్సిలరుగ నియమించిరి.

ఈ సంఘమువారొక మేగజేను (JR రెడ్ క్రాస్ మేగజేను అముద్రిత పత్రిక) ను స్థాపించిరి. ఈ పత్రికకు అరసాడ భానుమూర్తిని ఎడిటరుగను, మీటింగులు జరుపుటకును రికార్డు వ్రాయుటకును B నుండ

ర్రావు (శెక్రటరీ, P నారాయణమూర్తిగార్లను అసిస్టాంటుశెక్రటరీగను D. F. సూర్యనారాయణరాజు P రామమూర్తి గార్లను లీడర్లుగ నియమింపబడిరి.

ఈ సంఘసభకు శ్రీ సుబ్బారెడ్డిగారు (డాక్టర్ K. G. హాస్పటల్ శెక్రటరీ J. R. రెడ్ క్రాస్ (Vizag Dist) దయచేసి అనేక అంశములను గురించి ఉపన్యసించిరి. రెడ్ క్రాస్ సంఘము గురించి వ్యాసములు వ్రాసినవారికి బహుమతు లిత్తుమని నుడివిరి. వ్రాసిన వ్యాసములు డాక్టరుగారియొద్దకు పంపబడెను. అందు ప్రథమబహుమానము A భానుమూర్తికిని ద్వితీయ తృతీయ బహుమానములు B సుందర్రావు G కూర్మారావులకును వచ్చినవి.

ప్రథమచికిత్స నేర్పుటకు సదుపాయములు గలిగింతునని శ్రీడాక్టరుగారు నుడివిరి.

జయజయ శబ్దములతో సభ ముగిసెను.

ఇట్లు,

G. T. School }
Vizag }

అరసాడ భానుమూర్తి పట్నాయక్
ఎడిటర్
"జూనియర్ రెడ్ క్రాస్"

## వార్తలు

నరసారావుపేట గరల్సు రేంజీకి నూతనముగా సబ్ అసిస్టెంట్ ఇన్స్పెక్ట్రెస్‌గా విచ్చేసిన శ్రీమతి యం. సీతాలక్ష్మి బి.ఏ. యల్. టి. గారి గౌరవార్థము స్వాగత సమావేశము సీనియర్ డిప్యూటీ ఇన్స్పెక్టరు శ్రీయుత గూటాల సత్యనారాయణ బి. ఏ., యల్, టి., గారి యాజమాన్యమున జరిగెను. మునిసిపల్ బాలికా పాఠశాలల యుపాధ్యాయులచేతనున్ను, యు. యల్. సి యం. గరల్సు హయ్యర్ ఎలిమెంటరీ స్కూలు ప్రధాన సహాయోపాధ్యాయులు బాలకవి అన్నాప్రగడ వీరరాఘవయ్యగారిచేతను, స్వాగతపంచరత్నములు చదువబడెను. అధ్యక్షులు ప్రసంగించుచూ అనుభవనీయయగు ఇన్స్పెక్ట్రెస్‌గారి పాలనమున రేంజీ సర్వతోముఖమైన యభివృద్ధి నొందగలదనియు వాక్రుచ్చిరి. మంగళధ్వనులతో సభముగిసెను.

B. H. V. Narasimham.

# చోడవరం రేంజి - మహాసభ

### అల్పాహారవిందు జరిపించినతరువాత

5-12-43 తేదీని చోడవరంరేంజి ప్రాథమికోపాధ్యాయ యూనియన్ త్రయమువారి మహాసభ ప్రార్థనలతో శ్రీమండ సుబ్బారావుపంతులు బి. ఏ., బి. యల్. గారి అధ్యక్షతను ప్రారంభించడమైనది. సుమారు 300 మంది హాజరైరి. రిటైరైన డిప్యూటీ ఇన్స్పెక్టరువారగు శ్రీ కొమదుపాటి వేంకటేశం పంతులుగారికి సన్మానపత్రమున్ను, వారిస్థాన మలంకరింప దయచేసిన శ్రీ. వి. సుబ్బారావుపంతులు యం. ఏ. ఎల్. టి. గారికి స్వాగతపత్రమున్ను, పద్యములలో పండిట్ పట్టిసపు శ్రీ రామమూర్తికవిగారు సమర్పించిరి శ్రీ హేజీబు వెంకటరావుగారు, శ్రీ మండసాంబశివరావుగారు, శ్రీ కోటసీతారామజోగయ్యగారు, శ్రీ కాశీభొట్ల కృష్ణారావుగారు, మున్నగు ఉపాధ్యాయులు వారివారి ఆశయములను పద్యములతోను వచనరచనలతోను, వెల్లడించిరి. హరిజనోద్ధారకులగు, శ్రీ శేషాభీమశంకరం పంతులుగారి సందేశమునుగూడ సభలోవినిపించడమైనది. చోడవరప్రముఖులలో ప్లీడర్లు పెక్కండ్రు, శ్రీ దూర్వాసుల సీతారామమూర్తి పంతులుగారు, శ్రీ కొడుకుల నరసింహం పంతులుగారు, శ్రీ కందర్పరామేశం పంతులుగారు, శ్రీ దూర్వాసుల దక్షిణామూర్తి పంతులుగారు, శ్రీ కవికొండల సత్యనారాయణమూర్తిగారు, మొదలైనవారు చక్కని శైలిలో ఉపన్యసించిరి. శ్రీ డిప్యూటీ ఇన్స్పెక్టర్లుఇద్దరును వారివారి సమాధానములను వెల్లడించిన తర్వాత అధ్యక్షులు గంభీరోపన్యాసము గావించిరి. పిదప శ్రీ ఈశ్వరసీతారామమూర్తిగారి అభివందనములతోడను, సుదర్శనం సీతారామాచార్యులుగారి స్వస్తివచనములతోను, సభరాత్రి 9గం॥ కు ముగించడమైనది.

పట్టిసపు శ్రీరామమూర్తి, కార్యదర్శి.

## చిత్తూరుజిల్లా వెదురుకుప్పంసెంటరు.

ది 11-12 1943 తేదిన చిత్తూరుజిల్లా పుత్తూరురేంజి వెదురుకుప్పం సెంటరు ఉపాధ్యాయసంఘ సమావేశ సభలో గావింపబడిన తీర్మానములు.

1 చిత్తూరు జిల్లాబోర్డు రిజల్యూషన్ నెం. 44 Dt 25-9-43 తేది మేరకు సెకండరీగ్రేడు ఉపాధ్యాయులకు సర్వీసులోచేరిన తేదిమొదలు 30-6-35 సర్వీసుకు యింక్రిమెంటు యిచ్చినట్లు, హయ్యరుగ్రేడు ఉపాధ్యాయులకు కూడ యింక్రిమెంటు ఇయ్యవలెననియు-

2. సామానుల వెలలు హెచ్చియుండుటచేత ఎలిమెంటరీబడులలోని ఉపాధ్యాయులకు యిప్పుడిచ్చు వార్ అలవెన్సు రెండురూపాయలు చాలనందున సర్కారు ఆఫీసులలో యిచ్చునట్లు రు 6-8-0 లు యివ్వవలెననియు-

3. స్టేషనరీసామానులు, పోస్టేజి వెలలు, అధికమైనందున ప్రతియుపాధ్యాయునకు కంటెంజెంటు 8 అణాలు యివ్వవలెననియు-ఈసభవారు చిత్తూరుజిల్లాబోర్డు ప్రెసిడెంటువారిని కోరి ప్రార్థించుచున్నారు.

4. బాలికా ప్రమోషన్ నేట్ కొంతతగ్గించవలెనని యీసభవారు విద్యాశాఖాధికారులను ప్రార్థించుచున్నారు.

5. ఇంక్రిమెంటు జిల్లాబోర్డుబడులలో యిచ్చు రీతిగా పంచాయతీ బడులలో పనిచేయు ఉపాధ్యాయులకుగూడ యివ్వవలెనని శ్రీ లోకలుబోర్డు ఇన్స్పెక్టరువారిని యీసభవారు ప్రార్థించుచున్నారు.

యస్. వాసుదేవరావు,
సెక్రటరీ.

మాగ్రామమున ఆరోగ్యవారము 13—12—43 తేది మొదలు 18—12—43 తేదివరకు జయప్రదముగ జరుపబడినది 16,17, తేదీలందు మాగ్రామ శ్రీకృష్ణవిద్యాలయము బాలబాలికలచే మాపంచాయతీబోర్డు ప్రెసిడెంటుగారగు శ్రీయుత దావులూరి చినబసవయ్య చౌదరిగారును, మాగ్రామవిద్యార్థుల తల్లిదండ్రుల సంఘాధ్యక్షులగు శ్రీ దావులూరి కోటయ్యచౌదరిగారును, మరికొందరు పేరులును ఆటలలో పందెములు పెట్టియు, నాటకప్రదర్శనముల గావించియు, తరగతులు నిర్ణయింపబడెను. 18-12-43 తేది సాయంత్రము 2 గంటలనుండి శ్రీరామాలయమువద్ద శ్రీ దావులూరి చినబసవయ్య చౌదరి (పంచాయతీబోర్డు ప్రెసిడెంటు) గారి అధ్యక్షతను బహిరంగసభ జరుపబడెను మాపాఠశాల ప్రధానోపాధ్యాయులు శ్రీఅన్నాప్రగడ వెంకట సుబ్బారావుగారు ఆరోగ్యవిధులు, నీరు, గాలి, ఆహారపదార్థములను గురించి ఉపన్యాసమిచ్చిరి. గెలుపొందిన బాలబాలికలకు ప్రెసిడెంటుగారిచే బహుమతు లివ్వబడెను. ఉదారులగు మాపంచాయతీ బోర్డువారు ఆరోగ్యవారము జరుపుటకు రు 10-0-0 లు పదిరూపాయలు ఖర్చుపెట్టిరి. సభ జయధ్వానములతో ముగింపుచేయబడెను.

కొ.త్తలూరు
14—12—1943

అన్నాప్రగడ వీరరాఘవయ్య

మాగ్రామమున 13-12-43 మొదలు 18-12-43 తేదివరకు ఆరోగ్యవారము జయప్రదముగ జరుపబడినది. 18-12-43 తేది పంచాయతీబోర్డు ప్రెసిడెంటుగారగు శ్రీయుత బొగ్గరం కోటయ్యగారి అధ్యక్షతను బహిరంగసభ గావింపబడినది. అందు బాలబాలికలకు బహుమతులు పంచబడెను. బీద విద్యార్థులందరికిని పలకలు యివ్వబడెను. బోర్డుస్కూలు ప్రధానోపాధ్యాయులగు శ్రీ వల్లూరి సూర్యనారాయణగారిచే ఆరోగ్యసూత్రములను గురించి ఉపన్యాసముగావింపబడెను. పిమ్మట ప్రేక్షకుల కరతాళధ్వనులు మిన్నుముట్టసభ ముగింపబడెను.

కొచ్చెర్ల
18—12—1943

వల్లూరి సూర్యనారాయణ
ప్రెసిడెంటు

అనంతపురం గుత్తితాలూకా గడేకల్లుబోర్డు హిందూహైయెడ్యుకేషన్ స్కూలునకు 8-12-43 దినము హఠాత్తుగ డి. యి. ఓ. గారైన శ్రీయుత డి. నరసింహశాస్త్రిగారు గుత్తిరేంజి స్కూళ్ళ డిప్యూటీ ఇన్‌స్పెక్టరుగారగు శ్రీయుత కె. రామశాస్త్రిగారితో వచ్చి స్కూలు విజిట్టుచేసిరి.

ఉపాధ్యాయులు పురాతనపద్ధతి ప్రకారము పాఠములుచెప్పుచు బడిపనులు ఉదయము 7 ఘంటల నుండి ప్రారంభించి సాయంకాలమువరకు జరుపుచున్నారనియు గ్రామమునందు దొరకు వెలలేని సామగ్రితో చేతిపనులు చేయించవలెననియు విజిట్టుపుస్తకములో వ్రాసిరి.

## యుద్ధ విద్యాప్రచారములు

ది 10-12-43 దినము బడిబాలుర తల్లిదండ్రాదుల విద్యాపోషక సంఘము సదరు స్కూలునందు శ్రీయుత వార్‌కమిటీ సెక్రటరీగారైన కె. క్రిష్ణారెడ్డిగారి అధ్యక్షతక్రింద జరుపబడెను. ఆదినము కోతకాలపు సెలవులవగాను స్కూలు మూయుదినము గావున బడిబాలబాలికలు అసిస్టాంటు మిష్ట్రెస్ అను పి. సీతమ్మ గారు నేర్పిన పురాణకథను నాటకమాడి చూచువారల కింపుగొల్పిరి.

ప్రెసిడెంటుగారగు కె. క్రిష్ణారెడ్డిగారు ప్రస్తుతయుద్ధపరిస్థితిని గురించి విపులముగా చెప్పిరి. తల్లి దండ్రాదులు బాలబాలికలను శ్రద్ధగా బడికిపంపవలెననియు విద్యలేనివారు పశుసమానము అని విద్యావిషయ మును గురించి విపులముగా చెప్పిరి.

హెడ్‌మాష్టరుగారగు బి. వి. సంజీవరాయుడుగారు మరియు అసిస్టాంటు టీచరుగారగు ఎస్. యం. నాగలింగస్వామిగారు వీరు ఈ సెలవుదినములలో బాలబాలికలు చేయదగిన పనులు తల్లిదండ్రాదులు వారికి తోడ్పడవలసిన విషయములు గురించి విపులముగా చెప్పిరి.

ఈ సభవారందరును భజనలతో విద్యాయుద్ధ ప్రచారములు గ్రామమందుసల్పుచు శ్రీ వేములవాడ భీమలింగస్వామి ఆలయమునందుచేరి మంగళవాద్యములతో సభ ముగించిరి.

గడేకల్లు, }
25—12—43. }

యస్. యమ్. నాగలింగస్వామి,
టీచరు.

## భీమవరంతాలూకా ఎయిడెడ్ టీచర్సుయూనియన్

**1.** ఈసంఘముయొక్క సప్తమస్థాయిసంఘ సమావేశము శ్రీ. డి. వి. సుబ్బారావుగారి ఆధిపత్య మున భీమవరం రెష్టుహౌస్ రోడ్డు పాఠశాలాభవనమునందు ది 4-12-43 తేదీని 12 గంటలకు జరుపబడి ఈ దిగువ తీర్మానములు గావింపబడెను.

2. ప్రస్తుత ప్రపంచ సంగ్రామమునందు, మిత్రమండలివారికి అన్నిరంగములయందు జయముచేకూరుగాక యని భగవంతునిగూర్చి ప్రార్థించుచు, ఈ సభవారు ఏకగ్రీవముగా తీర్మానించడమైనది.

3. జమాఖర్చులు సరిచూడడమైనది. ఖర్చులు అంగీకరించడమైనది. నిల్వమొత్తము రు 58-5-3 లో ఖర్చులు రు 3-14-0 లు పోను మిగిలినది రు 54-7-3 లు.

4. ఇద్దరు ఉపాధ్యాయులు ఉన్నచోట 30 ఏవరేజియున్నయెడల శ్రీ డిపార్టుమెంటువారు పూర్తి గ్రాంటు ఇచ్చుచున్నారు. తరువాత ప్రతి ఉపాధ్యాయునకు 20, యావరేజి యున్నయెడల పూర్తిగ్రాంటులు ఇచ్చులాగున ఏర్పాటులు చేయించగలందులకు శ్రీ డైరెక్టర్ దొరవారిని కోరుచు తీర్మానించడమైనది.

5. 36 ఏవరేజియున్నయెడల శక్షన్ చేసుకొనుటకు అనుమతిగలదు గాని, 30 ఏవరేజియున్న యెడల శక్షన్ చేసుకొనుటయున్ను, తరువాత ప్రతిశెక్షనుకు 20. యావరేజియున్నయెడల సెక్షన్ చేసుకొనుటకు, అనుమతిఇప్పించగలందులకు డైరెక్టరువారినికోరుచు తీర్మానించడమైనది.

6. ప్రత్యేక బాలికాపాఠశాలలున్నచోట బాలుర పాఠశాలలయందు 1 జాయంటు కుటుంబములోని వారిని, 1, 2, తరగతులు చదువుకొనుటయున్ను, 3 బాలికాపాఠశాలకు అరమైలు పైగాయున్న బాలికలను చేర్చుకొనుటయున్ను, శ్రీగుంటూరు మొదటి సర్కిల్ ఇన్‌స్పెక్ట్రెస్ దొరసాని అమ్మగారిని కోరుచు తీర్మా నించడమైనది.

7. ట్రయినింగు పాఠశాలయందు రెండుసంవత్సరములు చదివి ఉత్తీర్ణులు కానప్పటికి అట్టివారికి ఉద్యోగములు ఇచ్చుటకు అనగా (ఎగ్జంప్షన్) లేకుండగనే మానే జర్లుండు అనుమతి ఇప్పించగలందులకు శ్రీ డైరెక్టర్ దొరవారిని కోరుచు తీర్మానించడమైనది.

8. రాజమండ్రి ఆంధ్రపేపర్ మిల్సువారు తెల్లకాగితములు పరిమిట్ లేనిదే యూనియన్ ద్వారా తెల్లకాగితములు ఇచ్చుటకు వీలులేదని ఆర్డరు ఇచ్చియున్నారు గాన తాలూకా ఎయిడెడ్ టీచర్లకు, ఒక్కొక్కరికి 2 దస్తాలు కాగితములు తెచ్చుకొనుటకు పరిమిట్ శ్రీ సెక్రటరీగారైన Ch. శ్రీరామమూర్తి గారి పేరున ఇప్పించగలందులకు, శ్రీ జిల్లాకలెక్టర్ దొరవారిని శ్రీ. డి. యి. ఓ. గారిద్వారా కోరుచు తీర్మానించడమైనది.

9. ఒక్కొక్క టీచరుకు 4 శేర్లు కిరసనాయిల్ చొప్పున నెలకు యూనియన్ ద్వారా తాలూకా ఎయిడెడ్ టీచర్లకు సప్లైచేసుకొనుటకు మంజూరిచేయించుడు, సదరు కిరసనాయిల్ తెచ్చుకొనుటకు పరిమిషన్ శ్రీ సెక్రటరీగారైన సి. హెచ్. రామమూర్తిగారి పేరున పరిమిషన్ ఇప్పించగలందులకు శ్రీ జిల్లా కలెక్టర్ దొరవారిని, శ్రీ. డి. యి. ఓ. గారిద్వారా కోరుచు తీర్మానించడమైనది.

10. ఉండి సెంటర్ నుండి సి. హెచ్. సూర్యచంద్రరావుగారు, ఇప్పటికి మూడు మీటింగులనుండి హాజరుకానందునను, సదరు సెంటర్ నందు రెండవ హిందూ మెంబరు, అనవసరము గాన సదరుస్థానమును రద్దు చేయడమైనది.

11. ఇప్పటికి 3 మీటింగులకు వరుసగా రానటువంటి మెంబరుల స్థానములయందు తిరిగిఎన్నికలు జరిగించుటకుగాను తీర్మానించడమైనది.

12. శృంగవృక్షము సెంటర్ నుండి శ్రీ. కె. కొండయ్యగారు (ఆదిఆంధ్రసీటు) ఇప్పటికి షుమారు మూడుమీటింగులనుంచి రానందున సదరు సీటుసదరు సెంటరునందు రద్దుచేయుచుతిరిగి కోలమూరు సెంటరు నందు సదరు ఆది ఆంధ్ర సీటుఎన్నికలు జరిగించుటకు తీర్మానించడమైనది.

13. గరల్సుసీటునకు భీమవరంగరెల్సు సెంటరునందు ఎన్నికలు జరిగించుటకుగాను తీర్మానించడమైనది.

14. కోపెల్ల సెంటర్ నందు మెంబర్లు ఇద్దరును ఒక మీటింగునకు రానందున, సదరు సెంటర్ నందు ఎన్నికలు జరిగించుటకున్ను, చందావసూలు చేయుటకును, శ్రీ యస్. సూర్యరావుగారిని యూనియన్ కర్చుల క్రిందవెళ్లుటకు తీర్మానించడమైనది.

15. ఇంకను తాలూకాలోని సెంటరులందు సభ్యులుగా చేరదలచినవారిని 1943 డిశంబర్ నెల ఆఖరులోగా చేర్చగలందులకు స్థాయిసంఘ సభ్యులను కోరుచు తీర్మానించడమైనది.

16. సంతలు గల గ్రామములలో పాఠశాలలు 4 గంటలకాలము వరుసగా పనిచేసిన యెడల (విశ్రాంతి 15 ని గాక) ఆ రోజు పూర్తిదినముక్రింద పరిగణింపగలందులకు శ్రీ డి. యి. ఓ గారిని కోరుచు తీర్మానించడమైనది.

17. ఈ సంఘముయొక్క స్థాయిసంఘ సమావేశము తిరిగి 15-1-44 తేదీని 3 గంటలకు ఉండి శ్రీ వెంకటేశ్వర హిందూ ఎయిడెడ్ పాఠశాలా భవనమునందు జరుపుటకు తీర్మానించడమైనది.

వీరవాసరం }
5-12-43 }

ఇట్లు
సి హెచ్. శ్రీరామమూర్తి,
కార్యదర్శి